# పరీక్షా ఫలితాలు
















కుమారి తాంగేటి పండరి. గుడి.

## రామ్‌కో సూత్రం:

# పైకప్పు అనగానే ఏదయినా ఒకటే, అయితే...

....రామ్‌కో పైకప్పు అలాకాదు. అన్ని అస్బెస్టాస్ సిమెంటు రేకులు చూపులకు ఒక్కలాగే వుంటాయి. అయితే ప్రసిద్ధ నిర్మాణశిల్పులు, నిర్మాతలు రామ్‌కో అస్బెస్టాస్ సిమెంటు రేకులనే ఎన్నుకుంటున్నారు. అవి ప్రత్యేకంగా వుంటున్నవి, ఎందుకంటే వీరంతా శక్తినీ, మన్నికనూ కలిగి.... అగ్నికి, అరుగుదలకు తట్టుకునే గుణంకల వాటినే అడుగుతున్నారు. క్లుప్తంగా చెప్పాలంటే— వాతావరణ పరిస్థితులకు అతీతంగా, తక్కువ పోషణ ఖర్చుతో, శాశ్వత భద్రతకోసం వీరు చూస్తున్నారు. రామ్‌కో ఇలాంటి వాటిని అన్నిటినీ ఇవ్వగలుగుతోంది. కఠిన ప్రమాణాలకు ప్రాధాన్యత నివ్వటం, ఆధునాతన యంత్రాలతో తయారు కావటం, రామ్‌కో ఉత్తమ పనితనాన్ని ధృవ పరుస్తున్నాయి. పైకప్పు ఏదయినా ఒక్కటే.... అయితే ప్రసిద్ధ నిర్మాణశిల్పులకు, నిర్మాతలకు అలాంటిది కానిదేదో తెలుసు....రామ్‌కో!



**సదరన్ అస్బెస్టాస్ సిమెంట్ లిమిటెడ్**




739, అణ్ణాసాలై, మద్రాసు-600 002

ఆఫీసులు : బెంగళూరు ● విజయవాడ ● హైదరాబాదు ● కొచ్చిన్ ● పూనె

ఫ్యాక్టరీలు : ఆర్కోణం (తమిళనాడు) కరూరు (కర్ణాటక)



Ramco

అస్బెస్టాస్ సిమెంటు రేకులు మరియు తదితరములు

లోకంపోకడ...











## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
|1938 – 1972|
శుక్రవారం · 20 7 ·'79
సిద్ధార్థినామ సం. ఆషాఢ బ. ద్వాదశి
**సంపుటము 72 : సంచిక 45**
సంపాదకుడు .
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

## ముఖచిత్రం

22.6.79 వెలువడిన పత్రిక పై గల ముఖచిత్రం మాకు ఎంతో నచ్చింది. మా అభిమాన నటుడు కృష్ణంరాజు ఎంతో ఆకర్షణీయంగా ఉన్నారు. కథలు బాగున్నాయి. రాగరేఖలు సీరియల్ మాకెంతో నచ్చింది. కె. శ్యామలగారు రచించిన పాంథశాల కూడా బాగుంది.

పి. రమణి, అరుణాకుమారి, శ్రీలక్ష్మి, వేణు, రాము, రాజేశ్వరి [గుంటూరు.]

## కథలు

29.6.79వ తేదీనాటి సంచికలో 'దెయ్యాలు లేవు జాగ్రత్త', 'గడువు' అనే కథానికలు రెండూ మాకు చాలా నచ్చాయి.

గంటా ఉమాశంకర్ రెడ్డి, న్యాయపతి రమేష్ – బాబు, [బరంపురం]

* * *

22.6.79 తేదీ పత్రికలో కథల సంఖ్య పెంచినందుకు మీకు మా అభినందనలు. కథలలో 'బ్రతుకు తెరువు' కథ మాకెంతో నచ్చింది.

ఎ.ఎ. రమ. ఉరుకుండు, కె. వేణుగోపాల్ శెట్టి (ఎమ్మిగనూరు)

* * *

ఈ వారం [29.6.79] కథలన్నిటిలో గడువు కథ చాలా బాగుంది. కొన్ని కొన్ని పిచ్చి నమ్మకాల పాగరంలో కొట్టుకుపోయేవారికి నావ వంటిది ఈ కథ. ఇక మిగిలిన రెండు కథలు వాస్తవంగాయున్నవి.



కేకె శ్రీరామమూర్తి, [కోరాపుట్]

## సీరియల్

"ఇది ఒక పాంథశాల" సీరియల్ చాలాబాగున్నది.

డి. లక్ష్మి, [అవంతపూర్]

* * *

ఇది ఒక పాంథశాల సీరియల్ మమ్మల్ని ఎంతో ఆకర్షించినది. రచయిత్రికి అభినందనలు.

శ్రీమతి లతా ప్రసాద్, జోతిరాజు, [కొవ్వూరు]

* * *

"ఆంధ్రసచిత్ర వారపత్రిక" 6.7.79 నాటి సుష్మవర్మ ముఖచిత్రంతో అత్యంతాకర్షణీయంగా వెలువరించారు. పరిశ్రమ, 'ఇల్లరికపుటల్లుడు' కథలు చాలా బాగున్నాయి. "రాగ రేఖలు" సీరియల్ పత్రికకే హైలైట్. పత్రికను వారం వారం సకాలంలో సర్వాంగ సుందరంగా తీర్చి దిద్ది వెలువరిస్తున్నందుకు మా ధన్యవాదాలు.

జి. సుబ్బరామరాజు, కుమారి మహాలక్ష్మి, కుమారి, కమల, [గూడూరు]

* * *

29.6.79 ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా బాగుంది. ఇది ఒక పాంథశాల రాగరేఖలు సీరియల్స్ మా హృదయాలను ఆనందింపచేసినవి.

జి. బసవరాజు. లత, చెన్నప్ప, [పెల్లూరు]

## శీర్షికలు

29.6.79వ తేదీ పత్రికలో భారత ఉపగ్రహం గురించి ఇచ్చిన విషయాలు, విశేషాలు బాగున్నాయి. యువతలో మత్తు మందుల అలవాటు ఎందుకు? అన్న శీర్షిక చదివి, యువకులు కళ్లు తెరచి ప్రవర్తించాలి.

పెన్మెత్స సూరిబాబు, వెంకటేశ్వరరాజు, కృష్ణ, శీను, బాషా, [హైదరాబాద్]

* * *

యువతలో మత్తు మందు అలవాటు ఎందుకు? శీర్షికలో తాతా సామాజిక విజ్ఞాన శాస్త్ర సంస్థ జరిపిన సర్వే వలన అనేక విషయాలు తెలుసుకోగల్గాము.

డబ్బీరు ఉదయకుమార్, అశోక్, కె. ప్రమీల, డి. భవాని, [కుర్దారోడ్]



# రాగరశ్మి

సీరియల్

మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్



మళ్ళీ హైదరాబాద్ నించి పేపర్సన్నిటి లోనూ ఈ అడను ఇమ్మా ప్రకటన చేయించాను ఫోటోతో సహా! ప్రకటన పడ్డాక రోజూ ఎదురు చూడ్డమే అయింది మా పని!

పాప మాతో బాగా కలిసిపోయింది. పాప నాకు దొరికి మూడువారాల పైన అయింది. కొద్దిగా తెలుగు అర్థం చేసుకుంటోంది పాప.

పాపకోసం ఎవరూ రాలేదు. అప్పటికి నాకూ ఇంక పాప తల్లిదండ్రులు వస్తారనే ఆశ సన్నగిల్లుతోంది.

కానీ ఏం చెయ్యను?

"ఈ పాపను నేనే వుంచుకుంటేనో? నేనే పెంచి పెద్దచేస్తేనో?" అనిపించింది.

అనిపించిన మరుక్షణమే నా బుర్ర చెకచెకా పనిచెయ్యడం ప్రారంభించింది.

చిత్ర వచ్చాక చిత్రతో మాట్లాడి అదే పని చేస్తాను అనుకున్నాను.

ఈ మాట రామయ్యతో అంటే రామయ్య బిత్తరపోయాడు.

"ఏమిటి బాబూ మీరనేది? ఒక ఆడ పిల్లని పెంచి పెద్ద చెయ్యడమంటే మాటలా? ఇంకోసారి ఆలోచించండి—" అన్నాడు.

"ఆలోచించాల్సిందేముంది రామయ్యా? పాప నా దగ్గర బాగా చేరికయింది. నేనింక పాపని వదలలేను. ఏ అనాథాశ్రమంలోనో పాపని చేర్పించడం నా కిష్టం లేదు." అన్నాను.

"మీరు తొందర పడకండి బాబూ. అమ్మాయిగారితో కూడా మాట్లాడండి. తరువాత బాధ్యతంతా అమ్మాయిగారిదే కదా బాబూ. పాప బాగోగులు చూడాల్సింది ఆమెగారే కదా? ఆమెగారి కిష్టమయితేనే ఈ పని చెయ్యాలి. లేకపోతే మీ మధ్య మన

*(గత సంచిక తరువాయి)*

స్పర్థలు రావచ్చునేమో..."

రామయ్య చెప్పింది సబబుగానే తోచింది నాకు. చిత్ర రానీ అనుకున్నాను. మరో వారానికి చిత్ర వచ్చింది. రాగానే విషయం చెప్పలేదు నేను ఆమెకి. ఈలోపల పాప నా ప్రాణమయింది. పాప కోసం ఎవరూ రాలేదు కూడా! 'బాబా' అంటూ నన్ను వదలడం లేదు. నాకూ ఒక్క క్షణం పాపని చూడకపోతే లోటుగా వుండేది.

---

***జరిగినకథ 8 :*** శిల్పకి బెంగుళూరు లోని కెనరా బాంక్‌లో ఉద్యోగం రాగా, కృష్ణ అక్కడ చేర్పించటానికి వెళ్తుంటే రైలుకోసం పరుగెడుతున్న చిత్రను చూచి అతని మనస్సు గతంలోకి పరుగెడుతుంది. తల్లి ప్రసవ వేదనతో మరణించగా, తన తండ్రి అయిన వెంకట్రావ్‌ను చిత్ర ద్వేషించటం కృష్ణకు చిత్రంగా తోస్తుంది. అవివాహితుడైన తనతో శిల్ప ఉంటున్న కారణంగా ఆమెకు వివాహం జరగదేమోనని బాధపడ్తాడు కృష్ణ. అరుణ్‌తో అర్చనకి పెళ్ళి నిశ్చయమయిందని శిల్పకి చెప్తుంది వైదేహి. అర్చనని పెళ్ళి చేసుకోవటం అరుణ్‌కి గాని, అరుణ్‌ని పెళ్ళి చేసుకోవటం అర్చనకి కాని యిష్టముండదు. అరుణ్, శిల్ప ఒకరినొకరు ప్రేమించుకుంటారు. చిత్రని పెళ్ళి చేసుకుంటానని ఆమె తండ్రి వెంకట్రావ్‌తో కృష్ణ చెప్పగా, ముహూర్తం పెట్టిస్తాడు. శిల్ప పూర్వ వృత్తాంతం గురించి అరుణ్‌తో చెప్తూ వుంటాడు కృష్ణ. తను ప్రయాణించే రైలులో దొరికిన పాపను తీసుకొని తన ఇంటికి చేరుకుంటాడు కృష్ణ.

---

చిత్ర మామూలుగానే వుంది నేనే వాళ్ళింటికి వెళ్ళాను, ఆమెను చూడడానికి. ఇద్దరం కలిసి భలేకుతూలాడుకున్నాం; నవ్వుకున్నాం. కబుర్లు చెప్పుకున్నాం.

'నీకో ప్రెజెంట్ తెచ్చాను. సాయంత్రమిస్తాను' అంది చిత్ర.

నా ప్రయాణమంతా పాపతోనే సరిపోయింది. నేనేమీ చిత్ర కోసం తేలేదు. "పాపే చిత్రకి బహుమతి" అనుకున్నాను.

సాయంత్రం మా యింటికి వచ్చింది చిత్ర. చిత్ర వచ్చేటప్పటికి పాప నా ఒళ్ళో కూచుని నన్ను ముద్దు పెట్టుకుంటోంది. నవ్వుతూ వచ్చిన చిత్ర ముఖం ఎందుకో హఠాత్తుగా ముడుచుకు పోయింది.

"ఈ పిల్ల ఎవరూ?" అడిగింది కూచోకుండానే.

"మనపిల్లే— రా కూచో!"

"మన పిల్లా— అంటే—?"

"పెళ్ళికి ముందే నీకో కూతురిని బహుమతిగా ఇస్తున్నాను." నవ్వాను నేను.

"హాస్యాలు చాలుగానీ చెప్పండి!" అంది ప్రోధేయ పూర్వకంగా. ఆమెకు నవ్వురాలేదు.

"చెప్తాను చిత్రా. ఇట్లా కూర్చో?" అన్నాను పాపని కిందికి దించుతూ!

"పాప ముద్దుగా లేదూ?"

"ఊఁ!" అంది పరధ్యానంగా.

పాప వింతగా చూస్తోంది చిత్రకేసి.

చిత్ర చేతిలో రంగు రంగుల నగిషీ పని చేసిన ఒక ఫ్లవర్ వాజ్ వుంది. అది చేప ఆకారంలో చాలా అందంగా వుంది.

నాకోసం తెచ్చింది కాబోలది— గుంటూర్నించి! బల్లమీద పెట్టింది ఫ్లవర్‌వాజ్‌ని చిత్ర! కుర్చీలో కూచుంది.

పాప కళ్ళు ఫ్లవర్‌వాజు మీదే వున్నాయి.

చిత్రకి పాప విషయం వివరంగా చెప్పాను.

మౌనంగా విన్నది. ఆమె ముఖంలో ఏ భావమూ లేదు. అదేదో అంత ముఖ్య విషయం కానట్టు ముభావంగా – పరధ్యానంగా విన్నది.

నా మనసు చివుక్కుమంది.

అంత నిర్లక్ష్యంగా వున్న చిత్రకి నా మనసులోని మాటని చెప్పడానికి నా మనసు ఒప్పలేదు ఇద్దరి మధ్యా మౌనం రాజ్యం చేసింది చాలా సేపు.

" చాలా బావుంది చిత్రా ఫ్లవర్ వాజ్ – చాలా థాంక్స్ – నీ సెలెక్షన్ చాలా చాలా బావుంది" అన్నాను.

ముఖంలోకి సంతోషం వచ్చింది ఆమెకి. లేచి ఫ్లవర్ వాజ్‌లో నీళ్ళుపోసి, గార్డెన్ లోంచి తాజా పూలు కోసుకొచ్చి పెట్టింది వాజ్‌లో.

ఆ పూలు చూసి సంతోషంతో చప్పట్లు కొడుతూ వచ్చింది పాప నా దగ్గిరికి!

పాప సంతోషానికి నాకు ముచ్చటేసింది. దగ్గిరికి వచ్చిన పాప నా దగ్గిర్నించి బల్ల దగ్గిరికి వెళ్ళి వాజ్‌లోని పూలు తీయ బోయింది.

నేను వారిస్తూ "రామయ్యా, పాపకి గార్డెన్‌లోంచి మంచి పూలు తెచ్చివ్వు". అన్నాను.

పాప రామయ్యతో గార్డెన్‌లోకి వెళ్లింది. 'ఏంతైనా ఆడపిల్ల! పూలంటే ఇష్టం వుండడం సహజం మరి!' అనుకున్నాను.

"ఏం చేద్దామనుకుంటున్నారు ఈ అమ్మాయిని?" అడిగింది చిత్ర.

"అదే ఆలోచిస్తున్నాను" అన్నాను నేను!

*18*

పాపా, నేనూ కలిసి సాయంత్రం పూట రోజూ ఎక్కడికో అక్కడికి వెళ్ళడం అలవాటయింది ఈ మధ్య! నేను ఎక్కడికి వెళ్ళినా పాప రావాల్సిందే! కాలేజీకిమాత్రం వచ్చేది కాదు. టా–టా చెప్పి రామయ్య దగ్గిరే వుండిపోయేది. సాయంత్రం తప్పకుండా పాప నెక్కడికైనా తీసికెళ్ళక పోతే ఏడుస్తూ కూచునేది.

అదే విధంగా చిత్రతో నేనెక్కడికి వెళ్ళినా పాప కూడా మాతో వచ్చేది. పార్కుకీ, సినిమాకీ, షికారుకీ, టాంక్ బండ్‌కి, అన్నిచోట్లకీ పాప రావాల్సిందే. నేను వద్దని చెప్పలేక పోయేవాణ్ని.

ఇది చిత్ర కిష్టం లేదని తెలిసి పోతూనే వుండేది. పాప నా వళ్ళో కూచోడం, తన తోనే మాట్లాడాలన్నట్టు నన్నూ, చిత్రనీ మాట్లాడుకోనివ్వక పోవడం, నన్ను ముద్దు పెట్టుకోవడం, నా మెడ చుట్టూ చేతు లెయ్యడం, నా కళ్ళు మూయడం, అన్నీ నాకు తమాషాగా వుండేవి.

కానీ చిత్రకి గిట్టేవి కాదు. పాపని లాగి కింద కూచోబెట్టడం, కసురు కోవడం చేసేది చిత్ర. నాకు ఇది బాధ కలిగించేది.

నేనేం మాట్లాడలేదు.

" ఆ అమ్మాయి వచ్చినప్పటినించీ మీరు మారిపోయారు. నేనంటే శ్రద్ధ పోయింది మీకు. నాతో సరిగా మాట్లాడడం లేదు. నేనంటే... ప్రేమ తగ్గినట్టుంది." ఆ మాటతో కళ్ళ నీళ్ళొచ్చాయి ఆమెకి.

ఈ అభియోగానికి ఉలిక్కి పడ్డాను; చికాకు పడ్డాను.

"ఏం మాటలవి చిత్రా, నా మనసులో నీ స్థానం ఎప్పటికీ ఒకలాగానే ఉంటుంది."



"వూరుకో చిత్రా– చిన్న పిల్ల" అనే వాడ్ని. ఏం మాట్లాడేది కాదు చిత్ర.

ఆరోజు–

"ఏమండీ ఈ పిల్ల తల్లిదండ్రు లింక రానట్టేగా?" అంది.

నేను ప్రశ్నార్థకంగా చూశాను.

"ఏ అనాధాశ్రమంలోనో చేర్పిస్తే సరి" అంది.

"ఉంటుంది కానీ–కానీ– మీ ప్రేమలో మరొకరికి భాగం ఇవ్వడం నేను సహించ లేను. అది ఏ రకమైన ప్రేమైనా సరే... ఆ పాప చిన్న పిల్లే అయినా... మీ ప్రేమ, వాత్సల్యం, అభిమానం అన్నీ... అన్నీ... నాకే పరిమితం కావాలి..."

నేనాశ్చర్యపోయి చూస్తున్నాను.

"అందుకే ఆ పాప ఇంట్లో వుంటే...

రేపు పెళ్ళయ్యాక నా స్థితి ఎట్లా వుంటుందో... ఆ పాప మీ యింట్లో వుండకూడదు.''

"ఆ పాపని... మన పెద్ద కూతురుగా భావించలేవూ చిత్రా...''

"లేదండీ... నేను భావించలేను. అది నా చేతకాదు''

"చిత్రా ప్లీజ్ ఆవేశపడకు. ఆలోచించుకో. ఆ పాప, కల్లా కపటం ఎరుగని ఆ చిన్నపిల్ల, భగవంతుడి ప్రతిరూపమైన ఆ పసిపాప మీద నీకు కోపం ఎందుకు ?''

"ఏమోనండీ. నాది విచిత్రమైన మనస్తత్వం. నన్ను మీరు అర్థం చేసుకోండి.. ప్లీజ్...''

నాకు నోట మాట రాలేదు.

మౌనంగా వుండిపోయాను. రాను రానూ అశాంతి ఎక్కువవుతోంది నాలో. పాపని వదలలేను, చిత్రని వదులుకోలేను. పాప వుండటం చిత్ర కిష్టంలేదు. నేనేం చెయ్యాలి ? దీనికి పరిష్కార మేమిటి ? ప్రస్తుతానికి పెళ్ళి ముహూర్తం వాయిదా వేస్తే...? అనుకున్నాను. కాలమే పరిష్కారాన్ని సూచిస్తుంది- అనుకున్నాను. చిత్ర రాజీ పడవచ్చు అనుకున్నాను.

ఆ తరువాత రోజు చిత్రా వాళ్ళింటికి వెళ్ళి ఆమె తండ్రితో మాట్లాడాను. పరిస్థితి వివరించాను.

ఆయన అంతా విన్నాడు నాకు ఆశ్చర్యం కలిగించిన విషయం ఏమిటంటే ఆయన కూడా చిత్రనే సమర్థించాడు.

నాకే ఏవేవో సలహాలు ఇవ్వబోయాడు. "చూడు బాబూ—ఎవరో తెలీని అనాథ బాలికని తెచ్చి ఇంట్లో పెట్టుకోవడం తెలివి తక్కువ. నీకు చేతనైన సహాయంచేసి ఏ అనాథాశ్రమంలోనో చేర్పించు. చిత్ర కిష్టం లేకుండా నువ్వాపిల్లని ఇంట్లో వుంచుకుని ఎందుకు కలతలు కొనితెచ్చుకుంటావు?...'' ఈ మాటలు నాకు రుచించ లేదు.

ఆయన మీద కోపాన్ని కలిగించాయి. తను తన కూతురికి నచ్చచెప్పుకోవడంపోయి నాకు ఇట్లాంటి సలహాలు చెప్తాడా ? నేను లేవాను. అప్పుడు చెప్పాను. కొన్నాళ్ళు పెళ్ళి ముహూర్తం వాయిదా వెయ్యమని.

"తొందర పడకు నాయనా నెమ్మదిగా ఆలోచించు. ఈ ముహూర్తానికే పెళ్ళి జరిగిపోనీ...నా మాట విను...''

# రాగరేఖలు

"ఇది తొందర పడడం కాదండీ ! ఆ పిల్ల విషయంలో నేనేదైనా చెయ్యడానికి నాకు కొంత వ్యవధి కావాలి. అందుకని పెళ్ళి ముహూర్తం వాయిదా వెయ్యడమే మంచిది ప్రస్తుతానికి !'' అని వచ్చేశాను.

ఈ సంగతి విన్న చిత్రకి కోపం వచ్చింది.

"నా మీద మీకున్న ప్రేమంతా ఏమై పోయింది ? ఆ దిక్కులేని పిల్ల కోసం పెళ్ళి ముహూర్తం కూడా వాయిదా వేస్తున్నారు— చివరికి - చివరికి పెళ్ళే చేసుకోనంటారేమో...''

చిత్ర మాటలకి నాకు అసహ్యమేసింది. మా పెళ్ళి ముహూర్తం వాయిదా పడింది.

* * *

చిత్రకి నాకూ ఇట్లా వాగ్వాదాలు జరుగుతూనే వున్నాయి. నాకు నెమ్మదిగా నచ్చచెప్పడం ప్రారంభించిందామె. ఒకవైపు సమయం దొరికినప్పుడల్లా ఆమె తండ్రి సతాయింపు.

వీళ్ళ పోరు నేను పడలేక పోతున్నాను. ఒక రోజు దీర్ఘంగా ఆలోచించిన మీదట పాపని తీసుకుని అనాథ శరణాలయానికి బయలు దేరాను. రామయ్య పాపని రెడీ చేశాడు రెడీ అయి వచ్చాక పాప అడిగింది సంబరంగా!

"బాబాయ్ ఎక్కడికి? అమ్మా—నాన్నల దగ్గిరికా?''

నేను ఉలిక్కి పడ్డాను పాప యింకా అమ్మనీ- నాన్ననీ మర్చిపోలేదు ఈ మధ్య కొన్నాళ్ళుగా నేనీ ఆలోచనలోపడి పాపని అశ్రద్ధ చేస్తున్నాను. పాపని చూస్తుంటే అపరిమితమైన జాలి వేసింది. ఈ పాపని- అమాయకురాల్ని- అనాథ శరణాలయంలో వదలగలనా? అసలది ఎట్లా వుంటుందో? పాప హైదరాబాద్ వచ్చాక 'బాబా' అనే పిలుపుని 'బాబాయ్‌గా' మార్చివేసింది. పాపని దగ్గిరికి తీసుకుని ముద్దు పెట్టుకున్నాను.

"కాదమ్మా. ఒక పెద్ద యింటికి వెళుతున్నాం. అక్కడ అందరూ నీలాంటి పాపలే వుంటారు. వాళ్ళతో చక్కగా ఆడుకోవచ్చు. స్కూలు కెళచ్చు. చదువుకోవచ్చు.''

నా గొంతు నాకే కొత్తగా వినిపించింది. నేను పాపని మోసం చేస్తున్నాను. ఇది అన్యాయం !

నా అంతరాత్మ ఘోషించింది. ఆ అంతరాత్మ నోరు నొక్కి టాక్సీలో బయలుదేరాను. అనాథాశ్రమాల గురించి నేను కొన్ని చదివాను. వాటి గురించి నాకంత సదభిప్రాయం లేదు. కానీ నేనెన్నడూ వాటిని చూడలేదు 'చూడకుండా ఒక అభిప్రాయానికి రాకూడదు' అనుకున్నాను.

ఆ అనాథాశ్రమం సెక్రటరీని— కొంత మంది సభ్యుల్నీ కలుసుకున్నాను. వాళ్ళు బాగానే మాట్లాడారు. పాపని దగ్గిరికి తీసుకుని పలకరించారు. పాప గురించి వాళ్ళకి అన్నీ వివరించాను. పాపని చేర్పించను కుంటున్నానని చెప్పాను. కావాలంటే కొంత డొనేషన్ [redacted] గూడ ఇస్తానని చెప్పాను పాపని బాగా చూసుకోవాలని ప్రత్యేకించి చెప్పాను.

'లోపలికెళ్ళి చూడవచ్చా' అని అడిగాను.

వాళ్ళు చూడవచ్చునంటూ ఒక మనిషి నిచ్చి పంపించారు — అంతా చూపించమని

బిల్డింగ్ బావుంది. పిల్లలు అన్ని వయసుల వారూ ఉన్నారు. వాళ్ళు దాదాపు ఒకే రకం బట్టలు వేసుకుని వున్నారు.

అది వాళ్ళ భోజనాల టైము.

అంచరూవరసగా అల్యూమినియం ప్లేట్లు పెట్టుకుని కూచున్నారు. అల్యూమినియం గ్లాసులు. అన్నం, పులుసు, ఏదో కూర, మజ్జిగ వడ్డిస్తున్నారు.

మేము అక్కడేవుండి చూస్తున్నాము.

భోజనమయినాక బైట వున్న పంపుల దగ్గిర ఎవరి ప్లేట్లు వాళ్ళు కడుక్కుని, వాళ్ళ వాళ్ళ గదుల్లోకి వెళ్ళిపోయారు. అంతా క్రమశిక్షణగానే వుందనిపించింది. పిల్లల్ని పరీక్షగా చూసిన నేను ఒకటి కనిపెట్టాను. వాళ ముఖాల్లో, కళ్ళల్లో వింత నవ్వులూ వున్నా అదోరకమైన దీనత్వం వుంది ఆత్మీయత, ఆపేక్షల కోసం వాళ్ళు తపిస్తున్నట్టు కనిపించింది.

పాపవైపు చూశాను.

పాప కళకళ లాడుతూ వుంది.

కళ్ళు చురుగ్గా, ఉత్సాహంగా, ఆరోగ్యంగా మెరుస్తున్నాయి.

దీనత్వం మచ్చుకైనా లేదు.

చక్కటి గౌనులో అందంగా, హుందాగా వుంది. ఇక్కడ చేరిస్తే పాప కూడా వీళ్ళతో ఈ ప్లేట్లలో భోంచేస్తూ కళ్ళల్లో దీనత్వంతో, ఆత్మీయత, ఆపేక్షల కోసం తపిస్తూ ఊహించలేక పోయాను.

"పాపా నువ్విక్కడుంటావా?"

'ఆ' అని తలూపింది పాప.

"నువ్వు కూడా వుంటావుగా?" అమాయకమైన పాప మాటలు నన్ను కలచివేశాయి.

"లేదమ్మా నేనిక్కడ వుంటే వీలౌతుందా? నాకు పనులుంటాయిగా? అప్పుడప్పుడూ వచ్చి నిన్ను చూస్తుంటాను. నువ్వు చక్కగా పిల్లలతో ఆడుకుంటూ — చదువుకుంటూ వుండచ్చు- ఏం?"

కళ్ళల్లో ఉత్సాహం మాయమయింది.

భయంగా నన్ను పట్టుకుంది పాప.

"అయితే నేనిక్కడ వుండను. నేనూ నీతోనే వస్తాను. అక్కడే వుంటాను. అక్కడే వుండి చదువుకుంటాను."

కళ్ళు చెమర్చగా గట్టిగా హృదయానికి హత్తుకున్నాను పాపని. పాపని నేనిక్కడ చేర్పించలేను. పాపని అనాధగా నేనూహించలేను. తరువాత వచ్చి—వివరాలన్నీ మాట్లాడతానని చెప్పి- వాళ్ళకి థాంక్స్ చెప్పాను.

పాపని తీసుకుని వచ్చేశాను. తిరిగి టాక్సీలో పాపతోసహా ఎక్కేవరకు నాకు ఊపిరాడలేదు. మనశ్శాంతి లేదు టాక్సీలో ఎక్కాక- హాయిగా— తేలికగా అనిపించసాగింది.

* * *

అనాధాశ్రమానికి వెళ్ళి పాపని చేర్పించకుండా వచ్చానని తెల్సి చిత్రకి కోపం ఎక్కువయింది. మా ఇంటికి రావడం కూడా మానుకుంది. ఆమె తండ్రి మాత్రం ప్రతి రోజూ సాయంత్రం వచ్చి నాకు హితబోధ చేస్తూనే వున్నాడు. పెళ్ళి ముహూర్తానికి తొందర చెయ్యసాగాడు.

నాకేం చెయ్యడానికీ పాలుపోవడం లేదు. అనేకమైన ఆలోచనలతో సతమతమౌతున్నాను నేను. తట్టుకోలేక పోతున్నాను. నాకు పిచ్చెక్కేటట్టు వుంది. నాతో సహకరించని చిత్రని చేసుకుని నేనేం సుఖపడగలను? నన్నర్థం చేసుకోని వ్యక్తి నాకు భార్య అయితే నాకు మనశ్శాంతి వుంటుందా? కానీ— కానీ- చిత్రని తప్ప మరెవ్వరినీ వరించలేను నేను ఆమెని ప్రేమించిన నా హృదయంలో మరెవ్వరికీ ఆ స్థానం లేదు. ఇవ్వలేను కూడా!

పాపంటే చిత్ర ఈ ఇంటికి రాదు. పాప లేకుండా నేనుండలేను పాప కూడా నన్ను విడిచి వుండలేదు. ఇది తెగేదెట్లా? ఈ ఆలోచనలతో పోతున్న సమయంలో రామయ్య నాకో సూచన చేశాడు.

"బాబూ... మీరిలా దిగులు పడుతూ వుండడం, లక్ష్మీదేవి లాంటి అమ్మగారిని దూరం చేసుకోవడం చూస్తుంటే నాకు చాలా బాధగా వుంది. మీరేమీ అనుకోనంటే నాకో ఉపాయం తోస్తోంది బాబూ మీకు నచ్చితేనే... అట్లా చెయ్యచ్చు..."

"ఏమిటి చెప్పు" అన్నాను తలనొప్పిగా వుంది. రాత్రిళ్ళు నిద్రపట్టడంలేదు నాకు.

"మా తమ్ముడు సోమయ్య మీకు తెలుసుగా?" అడిగాడు.

"ఆఁ! అవును ఇప్పుడీ ఊళ్ళోనే వుంటున్నాడుగా? ఏం చేస్తున్నాడు?"

"అవును బాబూ ఇక్కడే వున్నాడు రిక్షా తొక్కుతుంటాడు వాడి భార్య



**20-7-1979 శుక్రవారం మొదలు**
**26-7-1979 గురువారం వరకు**

# వారఫలం

**మేషం :** వ్యాపార విస్తరణకు, మీరాశినాథుడు సకల విధాలా లాభదాయకుడు. రవి కూడ మీకు ధన విషయంలో, సుఖవిషయంలో, కార్యవిస్తరణ కలాపంలో సహకరించగలడు. వారం చివరి రెండు దినాలు, మీకు అన్ని వ్యవహారాలలో అనుకూలంగా ఉండగలవు. రాబడికి తగిన వ్యయం కూడ సూచితవు. స్త్రీలకు, ముఖ్యంగా వినోదకార్యక్రమం, పత్రికారంగంలో దీక్ష, దైవ కార్యాచరణ ఉంటుంది.

**వృషభం :** కార్యక్రమాలకు మార్పులు రావటంతో చికాకు కలుగుతుంది. ఆశించిన అవకాశం గాని, అనుకున్నట్లు రావలసినవారి నుండి ద్రవ్యము గాని లభించదు. వృత్తిలో, ఉద్యోగంలో ఏ విధమైన మార్పులుండవు. అవకాశాలు కూడా అంతగా కనిపించకపోవటంతో ఇబ్బందులుంటాయి. విద్యారంగంలో కూడ ఆశించిన ఫలితం చిక్కదు. స్త్రీలకు: ఉన్నత విద్యాస్థాయికి చాలా విధాల సహకారం జరిగినా లాభించదు. ఆరోగ్యం సామాన్యం.

**మిథునం :** మీకు, సహాయం చేయగలమిత్రులు భిన్నాభిప్రాయం గలవారై దూరంగా పోతారు. ఆశించిన, మాటసహాయం, ఆర్థిక సహాయం లభించదు. ఉత్తమస్థాయిలోనివారు కూడా మీకు సహాయం చేస్తారనిఅనుకోటానికి వీలులేదు. వ్యాపారానుకూలత మాత్రం మిత్రసహాయం సంపత్తి వల్ల లాభదాయకం. స్త్రీలకు విలాసానికి, వినోదానికి వ్యయం చేయటం, నూతన వస్త్రాలంకరణకు వ్యయం చేయుట జరుగుతుంది.

**కర్కాటకం :** విద్యా, పత్రిక, కళ, చిత్రరంగాను భవం గలవారికి, అప్రయత్నంగా అనుకూలతఏర్పడుతుంది. పుత్ర, పత్రికా వివాహ విషయంలో, ఆత్మీయులతో సంభాషణలు జరుపుట ఒక విమాత్ర సంఘటన ఈ వారంలో. భూసంబంధ, గృహసంబంధ, వ్యవహారాలు ఒక తావుకు వస్తాయి. దూర దేశాన్నుండి ధనం అందుతుంది. స్త్రీలకు: దైవ, శుభ కార్యాలతో, వ్యయంతో వారం గడుస్తుంది.

**సింహం :** అనారోగ్య సూచనలు, మీరెంత జాగ్రత్తగా ఉన్నా కనిపించకమానవు. సలహాను పాటించి, అనుపథసేవకుతోడు, ఇష్టం ఉండే, శని గ్రహానికి జపం చేయించి, ఆరాధించి, పూజించి మేలు పొందండి. మేలు జరుగకున్నా కీడు జరుగదు. స్త్రీలకు: ఆరోగ్యం, ఆనందం, సుఖసంతోషాదులకు లోపం.

**కన్య :** అనుకూల వాతావరణం, అన్ని రంగాలలో, ముఖ్యంగా, మీరు చేసే వృత్తిలో, వ్యాపారంలో సుముఖంగా ఉండటం గ్రహింప గలుగుతారు. ఆర్థికంగా బాగుంటుంది. విజ్ఞాన విషయంలో లాభదాయకం. స్త్రీలకు : విద్యా, విషయంలో ఉద్యోగతాపత్రయం లాభదాయకంగా ఉండగలదు.

**తుల :** ఇది జయకాలం. ఈ రాశి వారికి చాలామందికి యోగదాయకమని గ్రహస్థితితెలుపుతుంది. కృషిచేసి, అనేక పనులలో విజయం సాధించుకోగలుగుతారు. కుటుంబ విషయాల్లో మీరను కొన్నట్లే శాంతి సాధించుకోగలుగుతారు. స్త్రీలకు ఉద్యోగం, వ్యాపారం, ముఖ్యంగా, డక్టరు వృత్తిగోని వారికి, కళారంగంలో సదా విహరించే వారికి లాభదాయకం.

**వృశ్చికం :** మీ మనోభావాలకు విరుద్ధంగాఅన్ని పనులు జరగటంలో చికాకు సంభవం. సూటిన మిత్రుల సలహాలను యథాతథంగా పాటించటంతో ఇబ్బందికి గురికావటం తప్పనురే విధంగా లాభదాయకంగాదు. తీవ్రాలోచనలు పని చేయవు. స్త్రీలకు : విశ్వాసపాత్రులైన మిత్రుల సహాయం, తద్వారా లాభదాయకం.

**ధనుస్సు :** నిరంతర కృషి, బంధుమిత్రుల సహాయం, వ్యాపార రంగంలో, సాహిత్య రంగంలో మీకు అనుకూలత ఏర్పడుతుంది. అనుకోకుండా, బుధవారంనాడు, ఆదాయం ఉంటుంది. పట్టుదలతో కార్యసాధనకు నడుంకడుతారు. స్త్రీలకు : ప్రశాంతంగా వారం జరుగుతుంది. శుక్రవారం అనుకోకుండా సుఖసంతోషాలకు మార్గమేర్పడుతుంది.

**మకరం :** మీ అభివృద్ధినిగూర్చి, ఉద్యోగంలో మీకు అభివృద్ధిని చేకూర్చే విషయంలో, బంధువులు, మిత్రులు రహస్యంగా చర్చించి, సహాయం చేస్తారు. చుట్టుప్రక్కల వారిని మాత్రం ఒకకంట కనిపెట్టటం ఎంతైనా మేలు. స్త్రీలకు: కృషిరాణించి ఆర్థికంగా లాభదాయకం. పట్టుదలరాదు. ఆరోగ్యం బాగుంటుంది.

**కుంభం :** సంతాన విషయంలో, చెప్పరాని ఆనందదాయకమైన సంఘటన జరుగుతుంది. వారం చివరిరోజు మిక్కిలి లాభదాయకం. వ్యాపార విస్తరణ కార్యక్రమం యథావిధిగా జరుగుతుంది. స్త్రీలకు : ఏలోపం లేకుండా వారం సప్పుదాయకం. విలాసదాయకమైన కార్యక్రమంలో పాల్గొంటారు.

**మీనం** గ్రహబలం అనుకూలం. గోచారం లాభాన్ని చేకూర్చే విధంగా ఉన్నది. మానసికంగా చాల ఉత్సాహంగా ఉండటం, మీరు గ్రహించి, వారం చాల విధాల యోగదాయకమే. వాంఛించిన క్రమంలో మీ కార్యక్రమం సాగిపోతుంది. రాజకీయ రంగంలో పలుకుబడి పెరుగుతుంది. స్త్రీలకు: బంధువర్గీయుల సహాయంవల్ల సుఖదాయకంగా, లాభదాయకంగా కార్యక్రమం సాగిపోతుంది.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# రాగరేఖలు

మాలక్ష్మి చాలా మంచి పిల్ల బాబూ ... పెళ్ళయి పదేళ్ళైనా ఆయినా పిల్లలు లేరు. పిల్లలంటే మాలక్ష్మికి ప్రాణం బాబూ ... మన ... మన పాపని మాలక్ష్మి దగ్గిర వదిలితే...? చాలా బాగా చూసుకుంటుంది. కన్నతల్లిగానే సాకుతుంది. ప్రేమ అభిమానాలకు కొరత వుండదు.''

నా దగ్గిర ఇన్నాళ్ళ ట్రయినింగ్‌లో-రామయ్య యాస లేకుండా తెలుగు స్పష్టంగా మాట్లాడడం నేర్చుకున్నాడు.

నేనాలోచిస్తున్నాను.

"ఏటు తిరిగి పాపకు కావలసినవన్నీ మనమే కొనిస్తాంగదా ? పాపకి ఏ లోటూ వుండదు. ఈ ఊరే-అందులోనూ పక్క సందే కాబట్టి రోజూ వెళ్ళినా వెళ్ళి చూస్తూ వుండచ్చు. మంచి స్కూల్లోనూ చేర్పించచ్చు. చిత్రమ్మగారికి కూడా ఆ విధంగా ఏ అభ్యంతరమూ వుండకపోవచ్చు. మీకూ దిగులుండదు. -లోచించండి. మీకిష్టమయితేనే - అట్లా చేద్దాం...''

'మీ తమ్ముడు వుండేది ఎక్కడన్నావు ?'

''అదే బాబూ పక్క సందులో మందుల షాపు వెనక ... ఒక పూరింట్లో వున్నాడు.''

''మీ మరదలు ఏంచేస్తూ ఉంటుంది?''

''ఏం చేస్తుంది బాబూ...రెండిళ్ళల్లో పాచిపని చేస్తోంది...''

ఆ తరువాత నేనేం మాట్లాడలేదు. ఆరాత్రల్లా ఆలోచించాను.

రామయ్య చెప్పింది సమంజసంగానే తోచింది నాకు కూడా! పక్క సందులోనే మంచి ఇల్లొకటి చూసి వాళ్ళని అక్కడ వుండమని, పాపని వాళ్ళ దగ్గిర వుంచి-పాప కోసం నెలనెలా రెండు మూడొందలు ఇస్తే, పాపని వాళ్ళు శ్రద్ధగా చూసుకుంటారు. పాపకి తల్లి ప్రేమ లభించడం కంటే నాకు మాత్రం కావల్సిందేముంది? పాపని వుంచేసుకుని చిత్రని పెళ్ళిచేసుకున్నా, పాప కిక్కడ సుఖం వుండదు. చిత్ర పాపని కన్న కూతుర్లాగా చూసుకోలేదు. అసలు పాపని నేను వుంచేసుకునే పక్షంలో చిత్ర నన్ను పెళ్ళి చేసుకోడానికి ఒప్పుకోకపోవచ్చు. ఇట్లా చేస్తే ఎవరికి ఏ నష్టం వుండదు. నేను రోజూ వెళ్ళి పాపని చూస్తూండవచ్చు. నా అదృష్టం బావుంటే చిత్రే కొన్నాళ్ళకి పాపని తెచ్చుకోడానికి ఒప్పుకోవచ్చు!

(ఇంకావుంది)

# బంధుత్వాలు

కేశెట్టి కేశవరావు




మురళీ రేడియో క్లినిక్ ముందు కారొకటి వచ్చి ఆగింది.

"ఎవరిదిరా యీ కారు? కొత్తగా వున్నట్టుందే?" అనడిగాను.

నాకు ఈ షాపు అధిపతి మురళీ స్నేహితుడు. సాయంత్రాల పూట స్కూలు అయిపోయినాక అక్కడ కూచుని కాలక్షేపం చేస్తుంటాను. పైగ నాకూ రేడియో రిపేరింగ్‌లో కాస్త అభిరుచి వుంది. అక్కడ కూచొని, మా మురళీ రేడియోలు రిపేర్ చేస్తోంటే గమనిస్తుంటాను.

కారులోంచి ఎవరో ఒక పెద్దమనిషి దిగాడు. చాలా హుందాగా వున్నాడు. అతడి వెనకే మరో కుర్రాడు పెద్ద పాతకాలం నాటి రేడియోను పట్టుకు దిగాడు.

"కొత్త డాక్టరుగా రున్నట్టుందిగా!" అన్నాడు మురళీ

వూరిలోని ప్రభుత్వ ఆసుపత్రికి కొత్త డాక్టరుగారొచ్చారని విన్నానుకానీ, ఆయన్నింతవరకూ చూడలేదు.

కుర్రాడితో రేడియో మోయించుకుంటూ డాక్టరుగారు షాపు దగ్గిరికి వచ్చి, ముందు కుర్చీమీద కూర్చున్న నన్ను చూసి "మురళి అంటే ఎవరండి?" అని అడిగాడు.

"వారే!" నవ్వుతూ స్నేహితుణ్ని చూపాను.

ఆయన అటువేపు తిరిగి "నమస్కారం మీరేనా మురళి?" అనడిగాడు. మా వాడు నవ్వుతూ "అవును! నేనె, రండి! మీరు.." అని ఆర్ద్రంగా అడిగాడు లేచినిలబడుతూ.

"నా పేరు సుధాకరరావు. డాక్టర్ని. కొత్తగా ఈ వూరికి బదిలీ చేసారు. వచ్చిన దగ్గర్నుంచీ మిమ్మల్ని కలుసుకుందామనే అనుకుంటున్నాను. వీలవలేదు!" అన్నాడు. ఇంతలో కుర్రాడొచ్చి, రేడియోను షాపు ముందున్న పెద్ద బల్లమీద వుంచాడు.

"కూర్చోండి!" అని ఆసనం చూపించాడు మురళి డాక్టరుగారు కూర్చున్నారు. "మీకు సోమేశ్వరరావుగారు తెలుసా?" అనడిగాడు డాక్టరు మురళిని.

మురళి రేడియో వంకే చూస్తూ "ఏ సోమేశ్వరరావుగారూ?" అనడిగాడు. "అదే చీరాల ఆయనది. ఆయన కొడుకు రామనారాయణ హైదరాబాదులో ఇంజనీరుగా వున్నాడు" అన్నాడాయన.

మురళి ఏదో గుర్తుకు తెచ్చుకుంటున్నట్టు "ఓహో! ఆయనా! ఆయన నాకు మామగారు కావాలి లెండి! ఏమిటీ విషయం?" అన్నాడు.

"ఆహా! ఆయన నాకూ బంధువవుతాడు లెండి. మా మరదలు మామగారికి పెద్దన్న ఆయన! మేమీవూరు వస్తుంటేనూ, మీరిక్కడ వున్నట్టు మా మరదలు చెప్పింది వాళ్ళు బెజవాడలో వున్నారలెండి. అప్పట్నుంచి మిమ్మల్ని కలుసుకోమని మా ఆవిడ పోరుతూనే వుంది. కానీ తీరలేదు ఇప్పటికి ఆ అవకాశం కలిసి వచ్చింది" అన్నాడు డాక్టరు.

"సంతోషం" అన్నాడు మురళి. కుర్రాణ్ని కేకేసి కాఫీలు పట్టుకురమ్మని చెప్పాడు. వాడు కాఫీలు తెచ్చేంతలో,

"ఏమిటి! బంధువులని పేరేగానీ ఏప్పుడో గానీ చూసుకోవడం అవదు. వస్తూ పోతూ వుంటేనేగదా బాంధవ్యం!" అన్నాడు మురళి.

"అంతేమరి! ఏదో ఈ వుద్యోగంలో పడి నేను వూళ్ళు తిరుగుతుంటాను మీరు మీ వ్యాపార ధర్మంలోపడి ఈ వూరు కదలరు! మరెక్కడ బాంధవ్యం? ఏదో కాకతాళీయంగా యిలా కలిస్తే తప్ప..." అన్నాడు డాక్టరు.

ఇంతలో కాఫీలు వచ్చాయి. మురళి కాఫీలు అందరికి యిచ్చాడు. యిదుగో వీడు మా కుర్రాడు. ఇంటర్ పాసయ్యాడు. డిగ్రీలో చేర్చాలి. వీడేమో హైదరాబాద్‌లో

చదువుతానంటున్నాడు. నేను విశాఖపట్నంలో చదివిస్తామనుకుంటున్నాను. అక్కడ మా పెత్తల్లిగారబ్బాయి పోర్టులో పనిచేస్తున్నాడు లెండి. అక్కడవుంటే మనవాళ్ల అజమాయిషీ వుంటుంది కాబట్టి వీడి గురించి నాకేదిగులూ వుండదు. ఈకాలం పిల్లలు, కొత్త వూళ్ళోవుండి, అదుపూ ఆపూ లేక చెడు సావాసాల్లోపడి నిమిషాల్లో పాడైపోతారు. ఆనక మన చేతికి దొరకరు. అంతదాకా రానిచ్చామంటే అది మనతప్పే అవుతుంది!'' అన్నాడాయన.

"అంతేలేండి!'' అన్నాడు మురళి. "మనం జాగ్రత్త పడకపోతే మన చెయ్యి జారి పోతారు! ఇంతకీ ఇల్లెక్కడ తీశారు?''

"క్వార్టర్సున్నాయిగా!'' అన్నాడాయన.

"అక్కడ మీకు సౌకర్యంగావుందా?'' మురళి అడిగాడు.

"ఆం హా! లక్షణంగావుంది!'' అన్నాడు.

కాసేపు ఎవరూ మాట్లాడలేదు. తర్వాత డాక్టరుగారు గొంతు సర్దుకొని "చూడండి! ఈ రేడియో పాడడంలేదు. వినుకొండలో వున్నప్పుడు బాగానేవుండేది. యిక్కడికి వచ్చాక ఏమయిందో ఏమో, పలకడం లేదు. కాస్త చూడండి!'' అన్నాడు డాక్టరు.

మురళి రేడియోని ప్లగ్‌కి కనక్ట్‌చేసి, ట్యూనర్‌ని అటూ యిటూ తిప్పుతూ "యిది చాలా ఓల్డ్ మోడల్. వాల్వ్ రేడియోలు యిప్పుడెవరూ వాడడంలేదు. దీనిని ట్రాన్సిస్టరైజ్ చేయించుకోరాదూ? లేకుంటే కొత్తది కొనుక్కోరాదూ?'' అన్నాడు.

డాక్టరుగారు నవ్వుతూ, "నిజమే! కానీ ఇది ఒరిజినల్ హాలెండ్ రేడియో. సోమేశ్వరరావుగారున్నారు చూశారూ, వాళ్ళ చినాన్న కొడుకు కాలం నాటిది. ఆయన ద్వారా యిదిమాకు గిఫ్ట్‌గా వచ్చింది. అందుకే యిదంటే మాకు అంత మోజు! దీన్ని మార్చడం యిష్టం లేదు!'' అన్నాడు డాక్టరు.

రేడియోను విప్పి బయట పెట్టాడు మురళి. స్పీకరునుండి కనక్షన్ తీసివేసి తనకు మాత్రం వినబడేటట్టు హెడ్‌ఫోన్స్‌కి కనెక్టు చేసాడు. "నిస్సందేహంగా యిది రేడియోనే!... వద్దులెండి! దీన్ని మార్చడం అంత మంచిది కూడా కాదు. ఇలాటి

## బంధువులు

రేడియోలు ఇప్పుడు కావాలన్నా దొరకవు'' అన్నాడు మురళి హెడ్ ఫోన్స్‌ని తలమీద వుంచుకుంటూ.

"నిజం చెప్పారు. నా వుద్దేశం కూడా అదే'' అన్నారు డాక్టరు గారు. రేడియో భాగాల్ని కాసేపు అటూ యిటూ సర్ది, నాబ్స్‌ని అటూ యిటూ తిప్పి, పట్టకారుతో రేడియో భాగాల్ని అక్కడా, యిక్కడా పట్టి చూసి, పరీక్ష చేసాడు మురళి. కాసేపటికి, "దీనికి రెండు వాల్వులు పోయాయి. ఒక కండెన్సరూ, రేరియబులు...'' అని మురళి ఏదో అనబోయాడు.

డాక్టరుగారు మధ్యలోనే అందుకొని "అవన్నీమాకెందుకు? మీవంతు రేడియోను

## కర్తవ్యం

మనమంతా
మౌనంగా ధ్వని లేని
ఉక్కుపిడుగులా రాలాలి
మనమంతా
తీవ్రంగా కానరాని
అగ్నిగుండంలా రగలాలి.
మనమంతా
ఐక్యంగా జారిపోని
క్రొత్తసూర్యుణ్ణి తూర్పునే నిలబెట్టాలి
మనమంతా
వినరంగా
మరో లోకాన్ని మార్పుకై సృజించాలి.

—పి. మోహన్ రామ్‌ప్రసాద్

రిపేరుచేసి యివ్వటం. ఏమేం కావాలో మీరే చూసుకొంటారుగా! ఉజ్జాయింపుగా చెప్పండి. ఎంతవుతుందంటారు?'' అనడిగాడు.

"డెబ్భై అయిదు రూపాయలు కావచ్చు!'' అన్నాడు మురళి హెడ్ ఫోన్స్‌ని తీసేస్తూ.

పాలిపోయిన ముఖంతో "అబ్బ, డెబ్భై అయిదే! ఐదోపదో, పాతికో అవుతుందను కున్నాను'' అన్నాడు డాక్టరు.

"అబ్బే, నేనేమీ ఎక్కువ చెప్పలేదండీ! వాల్వుల రేట్లు పెరిగిపోయాయి. కావాలంటే, మీకు కేటలాగు చూపిస్తాను—అదీ కాక, ఒక కండెన్సరు, ఒకరేరియబులు...''

డాక్టరు మధ్యలో అందుకున్నాడు. "సర్లెండి! అవన్ని మాకేం తెలుస్తాయి. మీరయితే ఈ వూళ్ళో ఖచ్చితంగా రిపేరు చేస్తారని అన్నారు. అందుకనే వెంటనే మీదగ్గరికి తీసుకొచ్చాము!''

"నేను రిపేరింగు ఛార్జెస్ ఏమీవెయ్యడం లేదు. ఎలా వేస్తాను, మీరు డాక్టర్లు... అందులో మా బంధువులూ అయిపోతిరి!'' అన్నాడు మురళి.

"అహా! అలాగేం అనుకోవద్దు. బాంధవ్యానికీ, దీనికి ఏం సంబంధం లేదు. మీరు న్యాయంగా అందరికీ ఎలా ఛార్జి చేస్తారో, నాకూ అలాగే చెయ్యండి!'' అన్నాడు డాక్టరు బింకంగా. తను బంధువైనందుకు తనకి కన్సెషన్ చూపించాలన్న మాట ఆయనకి కాస్త బాధా కరంగా వున్నట్టనిపించింది నాకు.

"ఛ, ఛ! అందరి సంగతి వేరు! మీ సంగతి వేరు. మీరు రేపు సాయంత్రం ఎవర్నైనా పంపించండి! నేను సిద్ధంచేసి వుంచుతాను'' అన్నాడు మురళి

"ఇంకో గంటలో ఇవ్వడం అవదా?'' అనడిగాడు డాక్టరు. యిలాంటి వస్తువులు రిపేరర్ దగ్గర చాలా కాలం వదలడం ఎవ్వరికీ యిష్టముండదు... వాళ్లెవైనా పార్టులు మారుస్తారని భయం.

"సాధ్యంకాదుసార్! దీని వాల్వులు ఈ వూళ్ళో దొరకవు. హైదరాబాదు నుంచి తెప్పించాలి. దీనికి ఈక్వివలెంట్ వాల్వులు వేసెయ్యాలి. మార్చి వేస్తే సరిగా పాడదు. ఈరోజు మా తమ్ముడు రాత్రి బస్సుకు హైద్రాబాదు వెళ్తున్నాడు. తెప్పించి రేపటికి రడీచేసి వుంచుతాను'' అన్నాడు మురళి.

డాక్టరు నిరాశగా మొహం పెట్టి "సరే! రేపటికి సిద్ధం చేయండి! కుర్రాణ్ణి పంపుతాను'' అని వెళ్ళబోతూ ఆగి, "చూడండి! కాస్త బాగా చెయ్యండి!'' అని యింకా ఏదో చెప్పబోయి, చెప్పలేక వెళ్ళిపోయాడు. కారు కదిలి వెళ్ళిపోయింది.

కారు వెళ్ళిపోయాక మురళి ముసిముసిగా నవ్వుకుంటుంటే, "ఏమిటా సంగతి'' అని అడిగాను.

"నీకు వింత చూడాలని వుంటే, ఇలా లోపలికిరా!'' అన్నాడు. నేను లోపలికి

వెళ్లాను. వాడు హెడ్ ఫోన్స్‌ను నాకు పెట్టి, రేడియో ఆన్ చేసి ట్యూన్ చేశాడు. రేడియో విశేషంగా పలుకుతోంది. నేను ఆశ్చర్యపోయాను! 'ఇదేమిటా, యిది!'' అన్నాను వాడు చేసిన అన్యాయానికి అంతకన్నా మాటలు రాక

"మాగ! లేకపోతే పెద్ద మనిషి! యీ వూళ్ళో ఏ షాపులో రిపేరింగ్ బాగా చేస్తారని అన్నీ ఆరాలూ తీసే వచ్చాడు. వస్తూ వస్తూ బాంధవ్యం ఒకటి మోసుకొచ్చాడు. ఈ రేడియో ఏమీ పాడకాలేదు. వాల్వ్స్ కొంచెము లూజ్ అయ్యాయి. అంతే! అవి సరిచెయ్యగానే పాడుతోంది." అన్నాడు మురళి.

"మరి యిన్ని అబద్ధాలెందుకు? ఓ గంట రిపేరు చేసినట్లు చేసి, ఐదో, పదో లాక్కుంటే సరిపోయేదిగా, నీ కంత డబ్బు మీద ఆపేక్ష వుంటే!" తిడుతున్న ధోరణిలో అన్నాను "అలాగనకు! మనమో అరగంట రిపేరు చేసిస్తే, వాళ్ళకి నచ్చదు, మళ్ళీ ఏదో ట్రబుల్ అంటూ మాటి మాటికీ వస్తుంటారు. యిప్పుడయితే, కిక్కురుమనకుండా మనం అడిగినదంతా యిచ్చేసి, మనం చెప్పిన టైముకి రేడియోని పట్టుకుపోతారు వాళ్ళకి తృప్తి మిగుల్తుంది, మనకి లాభమూ మిగుల్తుంది!" అన్నాడు.

"లాభం మాట సరే! పాపం మీ బంధువట కూడాను! కాస్త కన్సెషన్ చూపవల్సిన కేసు!' అన్నాను నేను.

"వ్యాపారం వేరు! బాంధవ్యంవేరు!' అన్నాడు మురళి. నాకేమనాలో తెలియలేదు.

★ ★ ★

ఒకరోజు నేను సుధాకరరావుగారి డిస్పెన్సరీలో కూర్చున్నాను. గుడివాడలో వున్న మా బంధువొకాయన ఈయనగురించి వ్రాశాడు. వాడు, ఈయన మంచి ఫ్రెండ్సట. ఆ పరిచయాన్ని పురస్కరించుకొని, ఆయన సంగతులు నన్ను కనుక్కొంటుండమని రాశాడు. నేను, ఆయనయోగక్షేమాలువిచారించకపోతే ఆయన బాధల్లోపడిపోతాడని కాదు. కాస్త పరిచయం చేసుకుంటే మంచిదని, నేనే ఆయన దగ్గరికెళ్లాను కొద్ది రోజుల్లోనే మంచి ఫ్రెండయ్యాడు, నాకు. అదీగాక, ఒక కోర్టు వ్యవహారంలో నాకు లాయరుతో సంప్రదించవలసిన అవసరం వచ్చింది. మంచి నోటీసు ఒకటి పకడ్బందీగా లాయరు ద్వారా పంపించవలసిన అవసరం ఏర్పడింది. సుధాకరరావు గారికి- వచ్చి కొద్ది రోజులే అయినా- లాయర్లలో మంచి పేరుంది. ఆయన ఇన్‌ఫ్లుయన్స్‌ని వుపయోగించుకొని ధర్మారావు అనే లాయరు దగ్గరికెళ్లాలని నా సంకల్పం. ఛార్జి సంగతి ఎలాగున్నా, నా పని లొసుగులు లేకుండా నెరవేరుతుందని నాఆశ. అసందర్భగానే ఆయన డిస్పెన్సరీకి వచ్చి, సంభాషణ ఎలా కదపాలో తెలియక కూర్చున్నాను ఆయన పేషంట్లని చూస్తూ, అటూ, యిటూ తిరుగుతూ, వుండుండి నాతో ఏదో ఒక మాట మాటాడుతూ వున్నాడు.

డిస్పెన్సరీ ముందు కారాగింది. అది మురళి మామూలుగా వాడే టాక్సీ. నాకు బాగా గుర్తేను. కాసేపట్లో మురళి టాక్సీలోంచి దిగి, వాళ్ల రెండో అమ్మాయిని నడిపించుకు టూ వచ్చాడు. ఆ అమ్మాయికి ఏమిటో నీరసం. ఈ మధ్య కొన్నాళ్ళుగా వొంట్లో బాగుండలేదు.

"ఏరా! ఏమిటి?" అని నేను మురళిని పలకరించాను. మురళి నావంక చూసి నవ్వి, "నమస్కారం... డాక్టరుగారూ!" అన్నాడాయన వంక తిరిగి ఆయన అదోలా మొహం పెట్టి, "మీరు... మిమ్మల్ని... ఎక్కడో..." అన్నాడు. నేను కల్పించుకొని "వీడు మురళి అండీ... మురళీ ఎలక్ట్రానిక్స్ షాపు వుంది చూడండి-" అని చెప్పబోయాను.

మురళి, 'మీ రేడియో కూడా బాగు చేసి యిచ్చాను సార్!! ఆరోజునించి మళ్ళీ మిమ్మల్ని కలుద్దామనే అనుకుంటున్నాను... కానీ, వెధవ వ్యాపారం, క్షణం తీరదు... కొన్నాళ్ళ క్రితం సోమేశ్వరరావు గారు ఉత్తరం కూడా రాశారు మీ గురించి' అన్నాడు.

సిరంజిలోకి మందు నింపుతూ, "ఏ సోమేశ్వరరావు" అనడిగాడు డాక్టరు గారు. నేను ఆశ్చర్యపోయాను; అతడెవరో నాకే బాగా గుర్తుంది. ఈయన మరచి పోయి వుంటాడా?

"అదే చీరాల సోమేశ్వరరావు గారు. ఆయన మాకు బంధువు కావాలి. మీకు కూడా..."

"ఓహో! ఆయనా? ఏమని వ్రాశారేమిటి?"

మురళి ఏదో చెప్పాడు. పేషంట్లని చూస్తూ, వాళ్ళకి మందులు రాసిస్తూ, డాక్టరుగారు అప్పుడప్పుడు మురళి చెప్పిన మాటలు వింటున్నాడు. పేషంట్లంతా వెళ్లిపోయాక, "ఏమిటి సంగతి? ఇలా వచ్చారు?" అనడిగాడు డాక్టరు.

మురళి "ఇది మా అమ్మాయండీ, కొద్ది రోజులుగ వీక్‌గా వుంటోంది. చాలామంది చేత మందిప్పిచ్చాను. నయం కాలేదు. మీ హస్తవాసి మంచిదని వూరంతా అనుకొంటున్నారు. మనవాళ్ళు యిలాంటి వాళ్ళుండగా వాళ్లని వదలి పెట్టి, యింకోరి దగ్గరికెళ్ళడ మెందుకని తీసుకొచ్చాను. మీదే భారం!" అన్నాడు.



# ధర్మపథం

## జీవితంలో విజయసాధన

ప్రతిమానవుడూ తాను ఏ లోటూ లేకుండా సుఖంగా జీవించాలనీ, పేరు ప్రతిష్ఠలు సంపాదించాలనీ కోరుతూ ఉంటాడు ఎక్కువ డబ్బు ఉన్నవాడే జీవితంలో సుఖపడతాడనీ, కీర్తి సంపాదించగలడనీ కొందరనుకోవచ్చు. కాని అలా అనుకోవడం పొరపాటు. లోకాన్ని బట్టి చూస్తే ధనానికీ, సుఖజీవితానికీ ఎక్కువ సంబంధం ఉన్నట్లు కానరాదు.

మానవుడు సంఘజీవి ఇతరుల సహాయం లేకుండా తాను ఏపనీ చెయ్యలేడు ధన సంపాదనకు కూడా ఇతరుల సహాయం అవసరమే! ధనవంతుడు పెట్టుబడిని పెట్టి, పెద్దపరిశ్రమలసంస్థలను నెలకొల్పి, అందులో ఎంతో మందికి పనికల్పించడం జరుగుతున్నది. యజమాని, తాను పోషకుడని, పనిచేసే వారు పోష్యులని భావిస్తూ, వారిని హీనంగా చూడడం, వారి కష్టసుఖాలను గమనించక పోవడం జరుగుతున్నది. పనిచేసే వాళ్ళు కూడా–తాము చెమట ఓడ్చి కష్టపడి తన యజమానికి ఎక్కువ ధనం సంపాదించి పెడుతున్నట్లు అనుకోవడం ఉన్నది. ఇలా పనివాళ్ళకు, యజమానులకు పరస్పరం అనుకూల్యం లేకపోవడం తరచు కానవస్తూ ఉంటుంది సమ్మెలకు, కర్మాగారాలు మూతపడుటకు ఇదే దారితీస్తుంది. దీనివల్ల ఏ పక్షం వారికీ ప్రయోజనం లేదు తీరని నష్టం కూడా కలుగుతుంది

యజమాని, తానూ సామాన్యమానవుడననే తెలుసుకుని, పనివాళతో కలిసి తానూ పనిచేస్తూ ఉండలి పని సక్రమంగా జరగడంలో వారికి తోడ్పడాలి. అప్పుడు పనివారికి యజమానిపై గౌరవాభిమానాలు కలుగుతాయి యజమానికి వారికష్ట సుఖాలు అర్థమై, వారికి తోడ్పడాలనే సంకల్పం కలుగుతుంది. ఈ పరస్పరా వగాహనవల పని సక్రమంగా సాగిపోతుంది తగాదాలకు అవకాశం ఉండదు

కొందరికి ధనంలేక పోయినా తాము సంకల్పించిన కార్య సాధనలో విజయం పొందుతారు. అట్టి వారికి ఇతరుల సహాయం ఉండుటవలనే కార్యసిద్ధి కలుగుతుంది. తాము ఇతరులకు సహాయపడితేనే–తాము కోరకపోయినా ఇతరులసహాయం లభిస్తుంది.

ఇతరులకు సహాయపడుటకే నిరంతరం పాటుపడుతున్న ఒకవ్యక్తి కొందరి నిర్బంధం వల్ల ఎన్నికకు నిలిచాడు. అతని త్యాగాన్ని గురించే అందరికి తెలుసును. వ్యక్తిని చాలా మంది ఎరుగరు అతడు ఒకప్పుడు ప్రచార సభలో మాటలాడుతున్నప్పుడు ఆయన ఎవ్వరో ఎరగని గ్రామస్థులు 'అయ్యా! మహాత్యాగమూర్తి, ప్రజాసేవకులూ అగు నపలానా వారు ఎన్నికలకు నిలవగా, ఆయనకు తప్ప మరొకరికి మా వోటు ఎలా ఇస్తాం? ఆయనకే మా వోటు'' అని ధైర్యంగా చెప్పారు ఆవ్యక్తి తానే అగు నందుకు ప్రజలకు తనపై ఉన్న ప్రగాఢ విశ్వాసానికి లోన పలేన తోషిస్తూ ''అయితే మీ ఇష్టం'' అని వేదిక దిగిపోయాడు. తర్వాత–అతడే తమ అభిమతవ్యక్తి అని తెలుసుకొని గ్రామస్థులు ఆశ్చర్య యారు!

*బులుసు వేంకటరమణయ్య*

---

# బంధువులు

ఆయన పేషెంట్‌ని పరీక్షచేసి గంభీరంగా వచ్చి టేబిలు ముందు కూర్చున్నాడు. ''అమ్మాయిని హాస్పిటల్లో చేర్పించండి. ఆపరేషన్ చెయ్యాల్సి రావచ్చు'' అన్నాడు, కళ్ళజోడు తీసి బల్ల మిద వుంచుతూ.

''ఆపరేషనా?'' మురళి మొహం పాలి పోయింది

''పెద్దదేమీ కాదు! మైనర్ ఆపరేషనే. అన్ని పరీక్షలు చేశాకగాని నిర్ధారణగా చెప్పలేం. మీకు సుమారు ఐదు వందలు ఖర్చు కావచ్చు'' అన్నాడు డాక్టరు

''ఐదు వందలా?...'' బలహీనంగా అన్నాడు మురళి.

''అబ్బెబ్బె! అది నా శ్రమకయ్యే ఖర్చని అనుకోవద్దండి. మందులకే యింత ఖర్చవుతుంది. అన్ని పరీక్షలు చెయ్యాలి కదా!... పైగా, మీరు తెలిసినే వాళ్ళు బంధువులని కూడా అన్నారు... మీ దగ్గర నేనేం ఛార్జెస్ వసూలు చేయను'' అన్నాడు డాక్టరు.

''అబ్బెబ్బె! అలా గేంవద్దు మీరు మామూలుగా ఎలా ఛార్జ్ చేస్తారో, ఆ లాగే చెయ్యండి! నాకు మా అమ్మాయి ఆరోగ్యం ముఖ్యం'' అన్నాడు మురళి.

''అలాగనుకోవద్దండి యివి మామూలు ఖర్చులు. మీరే చూస్తారు చీటి రాసిస్తాను. అమ్మాయిని హాస్పిటల్లో అడ్మిట్ చెయ్యండి'' అన్నాడు చీటీ రాస్తూ

చీటీని తీసుకొని అమ్మాయి వెంటరాగా మురళి వెళిపోయాడు. ''వస్తారా!'' అని నాతో కూడా చెప్పి వెళ్ళాడు.

అతడు వెళ్ళాక ''అతడు మీ ఫ్రెండా?'' అనడిగాడు డాక్టరు. ''అవు'' నన్నాను. ''చూశారా! అతడి తెలివి!! ఈ అమ్మాయికి ఏ జబ్బూ లేదు ప్యూబర్టీ టైంలో యిలాంటి బలహీనత మామూలు. ఏదో చిన్న వైద్యం చేస్తే సరిపోతుంది... కానీ, యిలాంటి వాళ్ళున్నారు చూశారూ! వీళ్ళకి మన వైద్యంమీద అపనమ్మకం. అందర్ని అడిగాడట మంచి వైద్యుడెవడని. వస్తూ బంధువు నంటూ చెప్పుకోవడం!! యిలాంటివాళ్ళ దగ్గర బాగా లాగితే తప్ప వాళకీ తృప్తి వుండదు, మనకీ లాభం వుండదు!'' అన్నాడు

నేనేమీ అనలేక పోయాను. లాయరు ధర్మారావు గురించే ఆలోచిస్తున్నాను నేను. అకస్మాత్తుగా నాకు ఒక అయిడియా వచ్చింది డాక్టరుతో అన్నాను. ''డాక్టరు గారూ! యీ ధర్మారావు గారు మాకు దూరపు బంధువు కావాలండీ! ఆ సంగతి ఆయనకు చెప్తుమంటూరా?'' అనడిగాను.

డాక్టరు ఏదో ఆలోచిస్తున్న వాడల్లా నావేపు తిరిగి, ''ఏమిటి? అంటున్నారు?'' అనడిగాడు.

''అహా! ఏం లేదులేండి, ఏదో చిన్న ధర్మ సందేహం వస్తేనూ!'' అన్నాను..

''ధర్మసందేహం తెప్పుడొస్తా, యంటే, మన ధర్మం ఏమిటో మనకి సరిగా అవగాహన లేనప్పుడే'' అన్నాడాయన.

''అంతేలెండి!'' అన్నాను నేను ధర్మారావును తలుచుకొంటూ.

( గత సంచిక తరువాయి )

























[ఇంకా ఉంది]

సాయంత్రం మునిసిపల్ పార్కులో కూర్చున్నాను. పిల్లల కోలాహలం విపరీతంగా ఉంది. జారుడు బల్లలపైన, బ్యాలన్సింగ్ బారుల పైన పిల్లలు ఆడుతున్నారు; కేరింతలు కొడుతున్నారు. పార్కులోని పచ్చదనంలో సజీవ పుష్పాల్లో పిల్లలు చెంగలిస్తున్నారు. ఆ దృశ్యాన్ని చూస్తున్న నాకు ఎంతో సంతోషంగా ఉంది.

అమాయికత్వం, చైతన్యం, ఉత్సాహం, ఉద్వేగం, ఆనందం స్పందన — ఆ ఎదిగే పువ్వు వంటి పిల్లల్లో కనబడుతుంటే గుండె పండుగ చేసుకొంటున్నది.

సిమెంటు బెంచిమీద కూర్చొని చూస్తున్న నేను అరగా కన్నులు మూసుకొన్నాను. బంగారపు సిరెండలో మెట్ట తామర పువ్వులు ఎర్రగా మండుతున్నట్లు కనబడుతున్నవి.

పార్కులోకి వస్తున్న నలుగురు స్టూడెంట్సు 'నమస్కారం సార్' అంటూ వెళ్ళారు.

పది నిముషాలైన తర్వాత ఇంకో గుంపు విద్యార్థులు వస్తూ 'గుడ్ ఈవినింగ్ సార్' అంటూ వెళ్ళారు ఉషారుగా.

విద్యార్థులు ప్రదర్శించిన ఈ గౌరవంవల్ల ఒక విధమైన గర్వరేఖ మనసులో పొటమరించిన మాట వాస్తవం!

నేను కూర్చున్న బెంచి ప్రక్కన గడ్డిలో పండుకొని ఉన్న పన్నెండేళ్ళ కుర్రవాడు, స్టూడెంట్సు నాకు నమస్కారం చేస్తూ వెళ్తున్న దృశ్యాన్ని చూసి, కళ్ళు నులుముకొని నా ప్రక్కన వచ్చి కూర్చున్నాడు.

నల్ల నిక్కరు, గళ్ళ చొక్కా వేసుకొన్నాడు. హిప్పీ జుట్టు! పెద్ద కళ్ళు! నిద్ర నుండి లేచినందువల్ల కొంచెం ఎర్రగా వున్నాయ్. ఎదురుగా లోకాన్ని మర్చిపోయి ఆడుకొంటున్న పిల్లల ఈడువాడే! వాళ్ళు హాయిగా ఆడుకొంటుంటే వీడు నిద్ర నుంచి మేలుకొన్నాడు.

'ఏటండీ గురూగారూ! మీరేం జేస్తారు?' ఆ కుర్రోడు నన్ను ప్రశ్నించాడు.

'గురువుగారు' అనే మాట స్టేషన్ల దగ్గర, సినిమాహాళ్ళ దగ్గర, మట్కా కంపెనీల దగ్గర, హోటళ్ళ దగ్గర, సారా దుకాణాల దగ్గర, ముండల కంపెనీల దగ్గర సాధారణంగా వాడే పదం! ఒకప్పుడు నిజంగా ఎంతో విలువైన పదం! కాకపోతే ఇప్పుడు అడ్డమైన ప్రతి నాలుక మీద అడ్డదిడ్డంగా నడయాడుతున్న పదం అయ్యింది! అంతే తేడా!

'నువ్వేం చేస్తుంటావోయ్?' నేను అడిగాను.

'అదేటి గురూగారు! ముందు నేను అడిగాను గదూ?'

'అవుననుకో! నేను పెద్దవాణ్ణి గదా! నాకు ముందు జవాబు చెప్పు.'

'నిజమేననుకోండి ... ఈ స్టూడెంట్సు కుర్రోళ్ళు ... పీస్ పాస్ మంటుంటే...యింగిలీసు బొమ్మల్లోలా ... మీరు పెద్దోళ్ళని అనుకున్నాలెండి ... అస్సలు ... యేం జెత్తారో .. తెలుసుకొందారని ... అడిగా.'

'సరేలేవోయ్ ... నేనే చెబుతా ... బస్సు స్టాండు దగ్గర కాలేజి వుంది చూశావా? దాన్లో పని చేస్తున్నాను.'

'బస్సు స్టేండింగ్ దగ్గరా? అవునండోయ్... పేద్ద బిల్డింగ్సులు ... చూశా ... దాన్లో ఏం జేత్తారండీ మీరో...'

'జె. ఎల్ అంటే జూనియర్ లెక్చరర్‌గా పన్జేస్తున్నాను.'

'అంటే ... ఏటండీ గురూగారు?'

'అంటే... స్టూడెంట్సుకు పాఠాలు జెప్పే ఉద్యోగం అన్నమాట... పదో తరగతి పాసై వచ్చే కుర్రాళ్ళకి పాఠాలు చెప్పాలి... పెద్దగా అరవాలి... అల్లరి చెయ్యకుండా చూడాలి... అర్థమయ్యేటట్లు చెప్పాలి... క్రమశిక్షణలో ఉంచాలి... అదన్నమాట ఉద్యోగం...'

'ఓస్ తెల్సిందిలెండి... అయితే... సరింగా... నా ఉజ్జోగం లాంటిదేనన్నమాట...' అన్నాడు మెరుస్తున్న కళ్ళతో.

'ఆఁ' అని ఆశ్చర్యంతో బెంచికి చేరగిలబడ్డాను.

'ఏమిటోయ్... నువ్వు వెలగబెడుతున్న ఉద్యోగం?' పరిహాసంగా అడిగాను.

'మూడు సినేమా హాళ్ళు లేవూ... అదేనండి మార్కెట్టు దగ్గర, గోరంట్లపేటకెళ్ళే దారిలో హాళ్ళండీ... లక్ష్మీటాకీస్ చూశారా? అక్కడ...' అని ఇంకా చెబుతుండగా —

'మాష్టారూ! మీకోసమే చూస్తున్నాం ... మీటింగ్ ప్రారంభమైంది ... బయలుదేరండి...' అని ఇద్దరు స్టూడెంట్సు వచ్చి నన్ను తొందర పెట్టారు. నేను లేచి ఆ కుర్రోణ్ణి చూస్తూ దగ్గరగా వున్న మీటింగ్ దగ్గరకు వెళ్ళాను. ఆ కుర్రోడేమిటి? ఉద్యోగం ... పైపెచ్చు నాలాంటి ఉద్యోగమట! మనసులో నవ్వుకొన్నాను.

వారంరోజులైంది. లక్ష్మిటాకీస్‌లో ఇంగ్లీష్ పిక్చర్ 'కింగ్ ఎలిఫెంట్' అనే సినిమాకి తీసుకొని వెళ్ళమని మా పిల్లలందరూ పోరుపెట్టారు. సరేనని తీసుకొనివెళ్ళాను.

ఇంటర్‌వెల్‌లో బైటకు వచ్చాను.

అఖండ దీపాల వెలుగులో, పెట్రోమాక్స్ లైట్ల కాంతిలో వేరుసెనక్కాయలు. బజ్జీ,పకోడీ, మషాల మిక్చర్, స్వీట్లు అమ్ముతున్నదుకాణాలు!

## దారేదీ?

చదువుతున్నా రోజా 'వాంటెడ్' కాలమ్స్ —
చావడానిక్కూడా అనుభవమే కావాలంటాను,
వయసు — పాతికేళ్ళు మించరాదంటార్,
అనుభవమ్మాత్రం—అయిదేళ్ళు కావాలంటార్!...
ప్రకటనలో పెద్ద జీతమే రాస్తార్,
ప్రయివేటుగా — ''డిపాజిట్'' కట్టమంటార్,
అన్నీ అయ్యాక —
ఇంకా ఉద్యోగం రాదేమయ్యా అంటే
నీకా ఉద్యోగం ''రిజర్వుడు'' కాదు —
పొమ్మంటార్!...
ఇప్పుడు చెప్పండి —
ఇంక ''ఉద్యోగం'' నాకెవడిస్తార్?
నా జీవితానికో దారెవడు చూపిస్తార్!

— మరువాడ భానుమూర్తి

సైకిల్ చక్రాల తోపుడు బండ్లమీద ఈ సరుకులు అమ్మేది ఒకడు; కొనమని అరిచేది ఇంకొకడు.

చాలా బండ్లున్నాయి. కాని ఒక బండి దగ్గర 'బజ్జీ, గరమ్ మషాల, పకోడీ' అని కంచుగంటలా గొంతు వినబడుతున్నది. ఆ గొంతుకు ఆకర్షితులైన జనం, ఎక్కువగా అక్కడే మూగారు. నేనూ అక్కడికో నాలుగడుగులు వేశాను. జనం ఎక్కువగా వుండడంవల్ల ప్రక్కగా నిలబడ్డాను.

'అరవరా ... కొడకా! బేరాలు సరింగా రావటంలా ... అరువు పెద్దంగా...' అంటున్నాడు చెక చెక పొట్లాలు కడుతున్న మనిషి.

ఇంకా శ్రుతి హెచ్చించి అరుస్తున్నాడు. ఆ గొంతులో ఒక ఆకర్షణ! ఒక రంజకత్వం వుంది ఇంకో రెండు నిముషాల్లో ఇంకా జనం అక్కడే మూగారు. ముఖ్యంగా ఆ గొంతు విని; రెండోది కొనాలని.

'తోసుకోవద్దు బాబు! ... సరసగా తీస్కోండి ... జేబులు జాగ్రత్తండి ... బజ్జీ ... పకోడి ... కారబ్బాంది ... మషాల...' అని కుర్రవాడు రికార్డులా పెద్దగా అరుస్తున్నాడు. కొనేవాళ్ళను చూస్తూ, అజమాయిషీ చేస్తున్నాడు. వాడికి పన్నెండేళ్ళు వుండవచ్చు. కాని గంటలా అరుస్తూ, కుక్కలా పని చేస్తున్నాడు.

చటుక్కున నాకు వారంరోజుల క్రిందట మునిసిపల్ పార్కులో నాతో ముచ్చటించిన కుర్రోడు జ్ఞప్తికి వచ్చాడు. వెంటనే దగ్గరగా వెళ్ళి సునిశితంగా చూశాను. ఆ కుర్రవాడే! ఆనాటి మాటలు గిర్రున నా తలలో తిరిగాయి. మనసు చివుక్కుమంది!

నేను పిల్లలకోసం కారపుబూంది కొంటుండగా నన్ను గుర్తుపట్టి 'ఏం గురూగారు! బాగున్నారా?' అన్నాడు. నేను నవ్వుతూ తల ఊపాను.

'మీ ఉద్యోగం లాంటిదే నా ఉద్యోగం' అన్న ఆ కుర్రవాడి మాటలు పదే పదే అలల్లాగా గుండెను తాకుతున్నవి.

ఎవరు ఏ ఉద్యోగం చేసినా, దానిమీద బాధ్యత, బరువు, మమకారం, గౌరవం పెంచుకొంటే తెల్లబట్టలు వేసుకొన్నా, నల్లబట్టలు తొడుక్కున్నా ఎక్కువ తక్కువ భావాలు వుండకూడదనే స్ఫురణ ఆ కుర్రవాడి మాటలమూలకంగా నాకు అవగతమైన పరమసత్యం! 'అరే! అదా మీ ఉద్యోగం' అని చిన్నచూపు చూసే చిన్నబుద్ధుల పెద్దవారి సంగతి వేరే విషయం!

ఒక విషమ సమస్య పరిష్కారం అయినంత ఆనందం కల్గింది. సామాన్య మానవుడికి జ్ఞానోపదేశం కల్గడానికి ఏ గుడిలోనో, గుహలోనో కూర్చోనక్కరలేదు. ఎదట వున్న మనుష్యుల మనుగడ గమనిస్తే చాలు అని అనుకొన్నాను.

'అవునన్నట్లు'గా సినిమాహాలులోని బెల్ మోగింది.

నేను ఆ కుర్రవాడిని చూస్తూ ముందుకు నడిచాను.

# ✚ డాక్టర్ సలహాలు ✚

– డాక్టర్ కె. వెంకటేశ్వర రావు

కె. జి. ఆర్. – కరీంనగర్

నా భార్య పెండ్లికి ముందు బాగానేవుండేది. పెండ్లి అయిన 10 రోజుల తర్వాత పిచ్చిపిచ్చిగా అరవటమూ రాత్రంతా నిద్ర పోకుండా వుండటమూ చేస్తుంటే డాక్టరుకి చూపించాము. డాక్టర్ 'అక్యూట్ మేనియా' అన్నారు. కొన్ని రోజులు బాగుంటుంది. దీనికేమి చెయ్యాలి ?

★ కొందరికి మానసిక దౌర్బల్యం వల్ల చిన్నప్పటినుండి మామూలుగా నలుగురితో కలిసి మెలిసి వుండకపోవటం, ఊహాగానాలతో ప్రొద్దు పుచ్చటం, దొరికిన సాహిత్యాలన్నీ చదివి వారికివారే 'మరో ప్రపంచం' సృష్టించుకొని నిజ జీవితంలో చలన చిత్రాలలో 'డ్రీమ్‌షాట్'లో చూపించే విధంగా వుండాలని అనుకోవటం, దానికి మించి ఆచరణలో పెట్టబూనటం వల్ల, వారి మానసిక స్థితి అత్యంత సున్నితంగాను, ఎవరు వారి దృక్పథానికి అడ్డు తగిలినట్లనిపించినా, వారిని ఏమీ అనలేని పరిస్థితికి దిగజారి మానసిక వ్యాకులత వల్ల బహిర్గతమయ్యే రోగలక్షణాన్నే మీరు వ్రాసిన జబ్బు అంటారు. కొన్నిరోజులు మామూలుగా వుండటం ఆ సమయాలలో ఆమె ఏర్పరచుకున్న ఊహాలోకానికి భంగమేర్పడక పోవటమే. మీరు కోరినట్లుగానే మానసిక వైద్య శాస్త్రంలో నిపుణులను కలుసుకొని వారి సలహా పొందటం మంచిదనే నా అభిప్రాయం. మద్రాస్, రాయవేలూరు, ఢిల్లీ, మైసూరు మొదలైన చోట్ల ఇటువంటి రోగాలు కలవారికి అన్ని సౌకర్యాలు, అన్ని పరీక్షలకీ కావలసిన సామగ్రి, నిపుణులైన డాక్టర్లు వుండటం గమనించ తగ్గ విషయం. అక్కడికి వెళ్ళి మిగతా వివరాలు సేకరించండి.

ఎస్. ఎల్. కె. – మద్రాస్

నా వయస్సు 16 సం॥లు. నాకు మొదలు ఎడమ బుగ్గ వాచినది. దానికి మందు వాడాను వాపు తగ్గి బుగ్గమీద బిళ్ళ రూపంలో గడ్డ కట్టింది. అప్పుడప్పుడూ నొప్పిగా వుంటుంది. దీనికేమి చెయ్యాలి ?

★ మీ వయస్సుని బట్టి మీకు ముందుగా ఏర్పడిన 'బుగ్గవాపు' అక్కడి 'మొటిమను' గిల్లటానికి ప్రయత్నించి విఫలం చెంది లేక కొద్దిగా మాత్రమే మొటిమలోని చీముని తీయగలగారని, మిగిన చోట, వత్తిడివల్ల నెత్తురు గడ్డ కట్టి, చీము మిగిలి పోవటం, ఆ ఫలితంవల్ల అక్కడి భాగం వాపుగానే నిలిచి పోవటం, అదే కారణం వల్ల ఆ చోట చీము క్రొత్తగాఏర్పడే సమయాలలో నెప్పి రావటం జరుగుతోందని ఊహించవలసి వస్తున్నది. ఈ వాపు అసహ్యకరంగావుంటే శస్త్ర వైద్యుల సహాయం అర్థించి చిన్న 'గంటు' పెట్టి గడ్డకట్టిన రక్తాన్ని చీముని తీసివేసి, పుండు మానటానికి మార్గాలు చెబుతారు.

కె. ఎస్. కె. – హైదరాబాద్

నా వయస్సు 30 సంవత్సరములు. నాకు ఒక సంవత్సరము నుండి రెండు, మూడు నెలల కొకమారు గుండెల్లో నొప్పిలాగ వస్తున్నది. ఇప్పుడు 10 రోజుల కొకమారు నొప్పి వస్తున్నది. నొప్పి వచ్చినపుడు ఒక గంటసేపు వుంటుంది. దీనికి తగిన వైద్యము తెల్పండి.

★ మీరు వ్రాసిన 'గుండె నొప్పి' అనేది కడుపులో ఏర్పడిన 'హైపర్ అసిడిటీ' (అంటే ఆమ్లం ఎక్కువగా కడుపులో ఉత్పత్తి అవటం) వలన అయివుంటుందని నా అభిప్రాయం మీకు ఇప్పటికీ గుండెనొప్పి అంటే కడుపులో ఏదో అంటాడేమిటని సందేహం, కోపం మొదలైనవి ఏర్పడివుంటాయి. కాని శరీర నిర్మాణం తెలిసిన వారికి కడుపు (అన్నకోశం) పైభాగం చనుమొనలు వున్న ప్రదేశం వరకు ఛాతీలో వుంటుందని అర్థమయేవుంటుంది. నిజానికి కడుపు అనబడే "అన్నకోశం" (స్టమక్) ఎక్కువ భాగం ఛాతీలోని ఎముకలగూడులోపలే వుంటుంది. గ్యాస్ట్రైటిస్, కడుపులో పుండు (అల్సర్) మొదలైనవి వున్నవారికి ఛాతీలో తరచు నొప్పి రావటం సహజం. ఎక్స్-రే తీసి ఛాతీలో ఏమీ లేదని నిర్ధారించు, కొని ఆ అధిక ఆమ్ల ఉత్పత్తికి విరుగుడుగా 'యాంటాసిడ్' మాత్రలు వాడండి. ఉదాహరణకు: ఆర్బిట్స్, జెలుసిల్ మొదలైనవి. ఆహారంలో కారం, పులుపు తగ్గించుకొని, ఆహారాన్ని సకాలంలో, కొద్ది, కొద్దిగా పలుమార్లు తీసుకోవటం మంచిది

ఎస్. ఆర్. ఆర్ – ఏలూరు

నాకు 15 రోజుల కొకమారు విరోచనము అవుతున్నవి. మలంలో 'ఎస్కారిస్ లుంబ్రికాయిడ్స్' వున్నట్లు తెలిసినది. మిగతా రోజుల్లో మలబద్ధకంతోపాటు యెక్కువగా గ్యాస్ పోతోంది.

★ మీ ముందు జాగ్రత్తలకు ఒక వైద్యునిగా అభినందనలు తెలియజేస్తున్నాను.

ఎవరికైనాసరే విరోచన సంబంధ రోగాలు వుంటే నిపుణులైనవారిచేత మలపరీక్ష దాదాపు ఆరు నెలల కొకమారు చేయించుకుంటే వారే ఆశ్చర్యపడే విషయాలు బయటపడతాయని తెలియ జేయుటకు మీరు చేయించుకున్న 'మలపరీక్ష' మంచి నిదర్శనం. మీకు పొడవైన గుండ్రంగా వుండే పురుగులు వున్నాయని తేలింది. కాబట్టి 'పైపర్‌జీన్ సిట్రేట్' అనే మందు రాత్రి భోజనానంతరం 50 సి. సి ల వంతున (1½ ఔన్సులు) లోనికి వరుసగా రెండు రాత్రులు తీసుకోవటం అవసరం. 10 రోజుల అనంతరం తిరిగి మలపరీక్ష చేయించుకొని, పూర్తిగా పురుగులు పోయేదాకా నెల కొకమారు మాత్రం ఈ మందు వాడాలి. మలబద్ధకం, గ్యాస్ మొదలైనవి వీటి ప్రభావంవలననే రావచ్చును

డి. సి. ఆర్. – నింపూరు

మా అమ్మాయి వయస్సు 8 సంవత్సరములు. మూడు నెలల క్రితం జ్వరం వచ్చి వెంటనే శరీర మంతా నొప్పులు ప్రారంభమై ముడుకులు, భుజములు ఆడుటలేదు. డాక్టర్ సలహాపై వైద్యము చేయించాము. గుణము కన్పించలేదు. ఇది 'రుమాటిక్' జ్వరం, క్రమేపీ తగ్గుతుంది, ఒక్కసారి తగ్గదు అన్నారు.

★ 'రుమాటిజమ్' అనే రోగం చిన్న వయస్సులోనే ఏర్పడటం చాలా అసహజం. ఈ రోగం వున్నవారికి మొదట్లోనే ఆ రోగాన్ని నిర్ణయించటం, ఆటు తర్వాత క్రమం తప్పకుండా వారానికోమారుగా 'పెనిడ్యూర్ ఎల్. ఎ' 6 ఇంజక్షనులు, 10 వారాలపాటు చేయించుకోవటం, ఫినైల్ బ్యూటా జోన్, మాత్రలు రోజుకి 3 వంతున 10 రోజులపాటు వాడటం ముఖ్యం. ఇంత వరకు కూడా ఈ రోగానికని ప్రత్యేక కారణం కనిపెట్టబడకపోయినా, శరీరంలో చీము పట్టగల ప్రదేశాలు వున్నవారికి ఈ రోగం వస్తుందని ప్రస్తుత అంచనా. ✲



## కార్టూనీయం







కార్టూన్లు గియ్యని వాడ్ని
పెళ్ళాడుతానని కూచుంటే
నాకీ జన్మలో పెళ్ళి కాదే
జయా! నా మాట విని
ఏ కథలు రాయని వాడ్నో
బొమ్మలు గియ్యనివాడ్నో
పెళ్ళాడుతానని
శపథం చెయ్యి
పరవాలేదు!

రాగతి పండరి




నువ్విలా ముక్కలిలా వేస్తే
నే నాడను! చెబుతున్నా!!



'ప్రియబాంధవి'లో శారద, రంగనాథ్

# సినిమా విశేషాలు -జి. వి. జి.

'మహాశక్తి'లో జయమాలిని, నరసింహరాజు

## కొత్త చిత్రాలు

''బొట్టు – కాటుక'' : శ్యామ్ ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్ కొత్త చిత్రంలో మురళీమోహన్ సరసన ఒక కొత్త నటికి అవకాశమివ్వబడుతుందని చెప్పారు విజయాబాపినీడు. రావుగోపాలరావు, జయంతి ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. దుర్గానాగేశ్వరరావు దర్శకుడు.

''సన్నాయి అప్పన్న'' : ''జూలై 14న షూటింగ్ ప్రారంభమవుతుంది, బ్రదర్. శోభన్‌బాబు – జయప్రద ఒక జంట, ఈశ్వరరావు – మాధవి మరో జంట, రమాప్రభ – నేను మూడవ జంట. దీపక్ డైరెక్టరు,'' అని తెలియజేశారు శ్రీ రమణ చిత్ర వారి తాజా వర్ణ చిత్రాన్ని సమర్పించే చలం. ఇంకా ప్రభాకరరెడ్డి, నూతన్‌ప్రసాద్, అల్లురామలింగయ్య, రాజసులోచన కూడా వుంటారు. పినిసెట్టి సంభాషణలకర్త. జె. సత్యనారాయణ ఛాయాగ్రాహకుడు. జి. కె. వెంకటేశ్ సంగీత దర్శకుడు. కూర్పు : రవి. నిర్మాణ నిర్వహణ : ఎం. ఎ. రెడ్డి.

''యువతరం కదిలింది'' : మాదాల రంగారావు 'నవతరం పిక్చర్స్' అనే సంస్థను నెలకొల్పారు. వీరి తొలి వర్ణ చిత్రంలో మురళీ మోహన్, రంగనాథ్, చంద్రమోహన్, శరత్‌బాబు, రావుగోపాలరావు, నాగభూషణం, గిరిబాబు, ఈశ్వరరావు, నరసింహరాజు, సత్యేంద్ర కుమార్, ప్రసాద్‌బాబు, ఎం. రంగారావు ఆదిగాగల వారుంటారని నిర్మాత మాదాల కోదండ రామయ్య వివరించారు.

సినిమాలయ ఆర్ట్ పిక్చర్స్ : ''కమలహాసన్ హీరో. వడమూరి మాటలు రాస్తున్నారు. ఆత్రేయ, కొసరాజు, సి. నారాయణరెడ్డి పాటలకు రాజేశ్వరరావు స్వరకల్పన చేస్తారు,'' అన్నారు ఎస్. ఖాదర్‌భాషా నిర్మించే చిత్రానికి దర్శకత్వం వెలుపే పేకేటి శివరాం. సెప్టెంబర్‌లో చిత్రీకరణ ప్రారంభమవుతుంది.

''చిత్రలేఖ'' : శశిరేఖ నాయికగా పుష్పరేఖ బానర్‌లో పుష్పవల్లి నిర్మించే చిత్రానికి మద్దిపట్ల సూరి సంభాషణలు రాస్తున్నారని కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే టి. మాధవరావు చెప్పారు. మహదేవన్ స్వరలహరిలో ఆత్రేయ గీతాలు రాస్తారు. బి. నంజప్ప ఛాయ, దిలీప్‌సింగ్

శిల్పం గల ఈ చిత్రానికి వెంకటేశ్వరరావు నిర్వాహకుడు.

మారుతీ ప్రొడక్షన్స్: "జూలైలో పాటల రికార్డింగ్, ఆగస్ట్ – సెప్టెంబర్‌లలో షూటింగ్ పూర్తి చేసుకొని, అక్టోబర్‌లో విడుదలకు సిద్ధమవుతుంది," అన్నారు నిర్మాత అడుసుమిల్లి లక్ష్మీకుమార్. వీరి తాజా రంగుల చిత్రంలో కృష్ణ, శ్రీదేవి, సత్యనారాయణ, రావుగోపాలరావు, అల్లురామలింగయ్య, గిరిబాబు, అంజలీదేవి నటిస్తారు. "ఇద్దరు కొత్త యువతులను కూడా పరిచయం చేయబోతున్నాం. అందమైన భవంతులలోనే షూటింగ్ జరుపుతాం. భమిడిపాటి రాధాకృష్ణ, చక్రవర్తి, పుష్పాల గోపీకృష్ణ, రాజేంద్రకుమార్, కోటగిరి గోపాలరావు టెక్నీషియన్‌లు," అని వివరించారు డైరెక్టర్ జి. సి. శేఖర్. ఈయన దర్శకత్వం వహించిన తొలి చిత్రం "జీవనతీరాలు" ఈయనకు మంచి పేరు తెచ్చిపెట్టింది. "అల్లరిబుల్లోడు" (తిరుపతిలో), "అతనికంటె ఘనుడు" నూర్రోజుల పండుగను జరుపుకున్నాయి. "శివకేశవులు" తర్వాత ఇతర సంస్థల నుంచి కూడా అవకాశాలు వచ్చాయి. కాని, నేటి ప్రేక్షకుల అభిరుచులకు అనుగుణంగా పకడ్బందీ అయిన కథ దొరికితేగాని, అంగీకరించదలచలేదీయన. "అటువంటి విశిష్టమైన కథ ఒకటి ఇటీవలే దొరికింది. కృష్ణ, జయప్రదలతో నవంబర్ నుంచి చిత్రీకరణ ప్రారంభమయ్యే ఈ చిత్రం గురించి వివరాలు త్వరలో తెలియజేస్తాము," అన్నారు శేఖర్.

శ్రీ లక్ష్మీనారాయణ ఆర్ట్ పిక్చర్స్: కృష్ణ, శ్రీదేవి కలిసి నటించే మరో చిత్రమిది. "సెప్టెంబర్‌లో పాటల రికార్డింగ్, అక్టోబర్‌లో షూటింగ్ ప్రారంభించి డిసెంబర్ కల్లా పూర్తి చేస్తాం," అన్నారు నిర్మాత కుదరవల్లి సీతారామస్వామి. ఈ వన్నెల చిత్రంలో యింకా సత్యనారాయణ, చంద్రమోహన్, ప్రభాకరరెడ్డి, అల్లురామలింగయ్య, కె. వి. చలం, సారథి, జగ్గారావు, ఆనందమోహన్, భీమరాజు, శ్రీలంక మనోహర్, రమాప్రభ, జయమాలిని, నిర్మల, అత్తిలి లక్ష్మితో పాటు గౌరవ పాత్రలలో మురళీమోహన్, త్యాగరాజు కనిపిస్తారు. ఎం. డి. సుందరం కథకు జంధ్యాల మాటలు రాస్తున్నారు. చక్రవర్తి సంగీతం, పుష్పాల గోపీకృష్ణ ఛాయ ఇతర హంగులు.

## సీమా నిర్ణయం

"నేను నటించే ప్రతి చిత్రంలో నూ 'సెక్స్'ను ఎలాగో 'మిక్స్' చేస్తుండడంతో నాకు

'అల్లరి వయసు'లో జయచిత్ర, మురళీమోహన్



'మంగళ తోరణాలు'లో తాళ్ళూరి రామేశ్వరి

'వెక్స్' అయిపోయింది. ఇటుపైన 'ఎ' చిత్రాలలో నటించను. 'ఎ–1' చిత్రాల్లోనే నటిస్తాను," అని ప్రకటించింది సీమా.



# సినిమా

## పేరులో నేమి పెన్నిధి గలదు?

కథకు తగ్గ పేరు కొన్ని చిత్రాలకు ఉండదు. చిత్ర విజయానికి అన్నిటికన్నా 'టైటిల్' ముఖ్యమైనదని పలువురు నిర్మాతల అభిప్రాయం. అంచేత, అది ఆకర్షణీయంగా ఉండాలని — కొన్ని రోజులపాటు బుర్రలు వేడెక్కేలా ఆలోచించి, అనవసరమైన కాలయాపనచేసి, చివరికి ఏదో ఒక పేరును హడావిడిగా పెట్టేస్తుంటారు కథకు సంబంధంలేని టైటిల్‌తో ప్రేక్షకుల తికమకలు పడడమూ కద్దు.

నేతిబీరకాయలో నెయ్యి ఎలా ఉండదో, లెడ్‌పెన్సిల్‌లోనూ లెడ్ ఉండదు.

కార్‌లో రవాణాచేసే సరకులను 'షిప్'మెంట్ అంటారు. షిప్‌లో పంపే సరకులను 'కార్‌'గ అంటారు.

విమాన ప్రమాదం సంభవించినప్పుడు సత్కారణాన్ని పరిశోధించడానికి ఉపయోగపడే 'బ్లాక్ బాక్స్' రంగు నిజానికి నలుపు కాదు—ఎరుపు, ఆరెంజ్, లేక లేత పసుపు రంగుల్లో ఉంటుంది.

అలాగే కొన్ని జెనరల్ పోస్టాఫీస్‌లలో 'అన్‌పైడ్ క్లర్క్' అనే ఉద్యోగి ఉంటాడు. దానికి సరియైన అర్థం 'జీతం, బత్తెం లేని గుమాస్తా' అని చెప్పాల్సివుంటుంది. బట్వాడా కాని పని అర్ధకేంను స్వీకరించి, లెక్క రాసుకోవడమే అతని పని. నిజానికి 'అన్‌పైడ్ ఎం. ఒ. క్లర్క్' అని పిలవ్వాలతన్ని.

ఇంతకీ, ఇటువంటి విషయాలన్నీ ఎందుకు చెప్పవలసివచ్చిందంటే కార్టూన్ చిత్రాలు తీయడంలో తనకు తానే సాటి అనిపించుకున్న స్వర్గీయ వాల్ట్ డిస్నీ ఒక్క విషయంలో మాత్రం ఎందుకు పొరబాటు చేశాడో నాకిప్పటికీ బోధ పడదు. అతను సృష్టించిన 'డోనాల్డ్ డక్'లో 'డోనాల్డ్' అనేది మగ పేరు. మొగబాతును 'డ్రేక్' అంటారు. మరి, 'డోనాల్డ్ డ్రేక్' అని ఉండాలికదా? 'డక్' అంటే ఆడబాతు. 'డ్రేక్ బదులు డక్' అని ఎందుకు ఉంచినట్లు?

అంచేత, అసలు సంగతికి, దాని పేరుకు ఎక్కడా సంబంధముండదు కొన్ని విషయాలలో.

నా వరకే తీసుకోండి. మా ఇంటి పేరు 'గడియారం'. కాని, నేను చెప్పిన టైమ్‌కు ఎక్కడా పోజరవను. సంక్షుయాలిటీని సరిగా పాటించను. దీనికేమంటారు?



'విజయ్ క్రియేషన్స్' చిత్రంలో సంగీత, కృష్ణ



'కుడిఎడమైతే'లో జయలక్ష్మి, నూతన్‌ప్రసాద్

## "బొమ్మా బొరుసే జీవితం"లో సర్వర్ సంజాయిషీ

అదొక పెద్ద హోటల్. ఓ వైపున కేబెరా డాన్స్ జరుగుతోంది. గజపతి (సత్యనారాయణ), అతని కొడుకు రాజా (మాస్టర్ రాజా) కూర్చొని చూస్తున్నారు. కుడికాలికి కట్టులో కుంటుకొని వస్తున్న ఒక సర్వర్ (నాగేష్)ను చూసి, రాజా పులుక్కున నవ్వాడు. దాంతో గజపతి ముఖం ప్రకాశవంతమైంది. "ఏమిటిరా అంతగా నవ్వుతున్నావ్?"

"చూడు డాడీ! ఆ బేరర్ నడక డాన్స్‌లాఉంది!"

గజపతి వెంటనే ఆ సర్వర్‌ను పిలిచి, "ఆ పిల్లలా నువ్వు డాన్స్ చేయాలి!" అన్నాడు.

సర్వర్ ఉలిక్కిపడ్డాడు. "నేనా! ఈ స్థితిలోనా?"

"నిన్ను చూసి నా రాజా నవ్వుతున్నాడు. అతని మొహంలో ఎప్పుడూ ఆ నవ్వే చూడాలి నేను — డాన్స్ చెయ్యి!"

"మీ బాబు నవ్వు కోసం నేను డాన్స్ చెయ్యాలా? మీలా నా జీవితంలో నేనెప్పుడూ కారెక్కలేదు, సార్! కారే నామీద ఎక్కింది. ఈ కాలితో, ఈ గాయంతో నేను డాన్స్ ఎలా చెయ్యగలను, సార్?" అంటున్నప్పుడు ఆ సర్వర్ కంఠం గాద్గదికమైంది.

కొమ్మినేని దర్శకత్వంలో యు. ఎస్. ఆర్. మోహనరావు నిర్మించిన సీతారామా ఆర్ట్ పిక్చర్స్ "బొమ్మా బొరుసే జీవితం" చిత్రం విడుదలకు సిద్ధంగా ఉంది.

## "వరుడా ! ఏమి నీ కోరిక"లో ప్రేమోపాఖ్యానం

చిరంజీవి [ఎ. ఎన్. ఆర్.], వసంత [జయలలిత] ప్రేమించుకున్నారు. ఒక రోజు ఇద్దరూ ఒకచోట కలుసుకున్నారు. "హాయ్!" అంటే "హాయ్!" అనుకున్నారిద్దరూ.

"ఐ నో... యు ఆర్ లవింగ్ మి."

"దేన్నిబట్టి అనుకుంటున్నారు ?"

"నెంబర్ వన్ — నేను రమ్మనమనగానే రావటం. నెంబర్ టూ — నాకోసమే వెయిట్ చేయడం. నెంబర్ త్రీ — అదే... అదే... నా కళ్ళల్లోకి కళ్ళుపెట్టి చూడటం... అవే ప్రేమ లక్షణాలు."

"ఓహో! మీ పిహెచ్. డి. లవ్ మీదేనన్న మాట ?"

"ఊ. మీరు కనిపిన్పటినుంచి దానిమీదే."

"యు ఆర్ రైట్, మిస్టర్ చిరంజీవి! నాకూ అంతే... రియల్లీ ఐ లవ్ యు."

"కాని, మన ప్రేమ ఫలించదు."

"ఎందుకని ?"

"మీరు వెన్నెట్లో ఎప్పుడైనా నడిచారా ?"

"ఓ యస్... చాలాసార్లు... ఐ లైక్ ఇట్."

"వెన్నెట్లో నడుస్తూ చందమామను ఎప్పుడైనా చూశారా ? ఏమనిపించేది ?"

"చందమామ మన వెంట వస్తున్నట్టు."

"కాని, ఇంట్లోకి వెళ్లిన తర్వాత చందమామ మీ వెంట రాదు అలాగే మనం ఇలా బయట కలుసుకున్నప్పుడు బ్రహ్మాండంగా ప్రేమించుకోవచ్చు. ఇంట్లోకి వెళ్లిన తర్వాత మీరు నన్ను మర్చిపోవాలి. మరచిపోతారు."

"నేనెందుకు మర్చిపోతాను ?" అంటూ వసంత, అతని కళ్ళల్లోకే చూస్తూండిపోయింది.

ప్రత్యగాత్మ దర్శకత్వంలో అనుమోలు వెంకట సుబ్బారావు నిర్మించిన ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ "వరుడా ఏమి నీ కోరిక" నవ్వుల చిత్రం త్వరలో విడుదలవబోతోంది.



'ప్రేమకు మేమే వారసులం'లో నారాయణరావు, రూప



'రాజీ ఆర్ట్ ఎంటర్ప్రైసెస్' చిత్రంలో శ్రీధర్, వాణిశ్రీ, శోభన్‌బాబు

### సంగీతమయం

ఒక సంగీత దర్శకుని పేరుతో ఓ తమిళ చిత్రం తయారవుతోంది. దాని పేరు "ఎళయరాజావిన్ రసిగై" [ఎళయరాజా అభిమానురాలు]. అరవింద్ ఫిలిమ్స్ నిర్మించే ఈ చిత్రానికి ఎళయరాజాయే సంగీత దర్శకుడు. ఎం. జి. ఆర్., అన్న కొడుకు ఎం. జి. సి. సుకుమార్ హీరో.

లోగడ "వాలి సుగ్రీవ" తెలుగు చిత్రానికి అయిదుగురు సంగీత దర్శకులు పని చేశారు. ఇటీవల తమిళ గాయకుడు, సంగీత దర్శకుడు సి. ఎల్. రాఘవన్ నిర్మాణం ప్రారంభించిన "కన్నిల్ తెరియుం వషిగళ్" చిత్రానికి ఆయనతో పాటు ఇళయరాజా, శంకర్—గణేశ్, కె. వి. మహదేవన్, జి. కె. వెంకటేశ్ సంగీత దర్శకులు. ఈ చిత్రం షూటింగ్ మన రాష్ట్రంలోనే జరుగుతోంది.

### చిత్రాల నామకరణం

కృష్ణ హీరోగా బీరం మస్తాన్‌రావ్ దర్శకత్వంలో విద్యాసాగర్ నిర్మించే తిరుపతి ఇంటర్నేషనల్ వారి చిత్రం పేరు "బుర్రిపాలెం బుల్లోడు".

సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో కృష్ణ, షా నిర్మించే చిత్రం "మంగళతోరణాలు".

కె. వాసు దర్శకత్వంలో తమ్మారెడ్డి వి. కె. నిర్మించే శ్రీ చరిత చిత్ర వారి చిత్రం పేరు "కోతలరాయుడు".

"ఐ లవ్ యు" అనంతరం ఎస్. భావనారాయణ తెలుగు కన్నడ భాషల్లో "కళావర్ రింగ్" అనే చిత్రం నిర్మిస్తారు.

[ 38వ పేజీ చూడండి ]

## తొలి సంధ్య రాగరంజితమైంది.
## ఆషాఢమాసపు తొలి రోజు తొంగి చూసింది.

**పక్షుల కిలకిలారావములు సుప్రభాత గీతాల్లా పగటిని మేల్కొలుపుతున్నాయి**

తెల్లవారుతున్నది – నిత్యకృత్యాలు నెరవేర్చాలి 'లేలెమ్మ'ని జనావళిని హెచ్చరిస్తున్నాయి కోడిపుంజులు తమ కూతలతో! అది బృహస్పతీ వారం! ఆ విద్యామందిరంలో ప్రాతఃకాల ప్రార్థనతో ప్రారంభమవుతుంది దినచర్య!

జయ జయ రామ్
జయ సాయిరామ్

ఓ మృదుమధుర కంఠం పలికింది. ముక్తకంఠంతో పలికారు విద్యార్థినులు.

"అనంతరక్షక సాయిరామ్
ఆపద్బాంధవ సాయిరామ్
జయ జయ రామ్
జయ సాయిరామ్!"

భక్తిభావంతో సాగిపోతున్నది భజన. భక్తి పారవశ్యంతో గీతాని కనువుగా తాళం వేస్తూనే, వరుసగా బారులుతీర్చి కూర్చున్న విద్యార్థినులను గమనిస్తున్నది ఉపాధ్యాయిని.

"ప్రేమస్వరూప సాయిరామ్
ప్రేమావతారా సాయిరామ్
జయ సాయిరామ్ జయ జయ రామ్
పురాణ పురుష సాయిరామ్
జయ జయ రామ్ జయ సాయిరామ్"

లయబద్ధంగా తాళం వేస్తూ పాడుతున్నవారి మనోమయ భక్తిశ్రద్ధలను పరీక్షగా వీక్షిస్తున్నది.

గవాక్షము నుంచి అగుపిస్తున్న నింగికేసి చూస్తున్న నళినిని మృదువుగా తాకింది వాసవి. ఇందీవరంలాంటి కనుదోయిని మెతారంగా మరల్చింది నళిని. విరహదాసిలాటి ఉపాధ్యాయిని 'సాయిరామ్' అంటూ నళినిని హెచ్చరించింది. 'సాయిరామ్ – జయ జయ రామ్' తలూపుతూ భజన పూపునందుకుంది నళిని. క్రీగంట చెలిని చూస్తూ కళ్ళతో పలకరించింది వాసవి. పచ్చని కోరికల ఊహాలోకంలో విహరించే ఆ వెచ్చని వయస్సులో ఆధ్యాత్మిక చింతనతో మనస్సును భగవధ్యానంపై లగ్నం చేయడం కష్టతరమే! భగవంతునిపై నిశ్చల భక్తి ఏ కొద్దిమందికో నిత్యారాధనవల్ల సాధ్యమవుతుంది. సాధనతో మనస్సును నిశ్చలంగా నిలిపినప్పుడే భక్తికి నిలయమవుతుంది. వారికి భజన ఆనందదాయకమవుతుంది. నిర్బంధ భజన వలన ప్రయోజనముండదు. కాన్వెంటులో స్త్రీల మఠం ప్రత్యేకంగా వున్నట్లు, ఇక్కడ కూడా భక్తులకు ప్రత్యేకమందిరముంటే బాగుండేది. ఈ తలంపు ఈ గురుకులం పెద్దలకు వస్తే...

"గుడ్‌మార్నింగ్ మేడమ్!"

నెరుగులాంటి నడకతో ఉత్సాహంగా వస్తున్న మేడమ్‌కి వాసవి విష్ చేయడంతో నళిని ఆలోచనలకు అంతరాయం కలిగింది.

"సాయిరామ్." నవ్వుతూ పలికింది ఉపాధ్యాయిని.

మూసివున్న బాబా గది తలుపులను పసుపు, కుంకుమలతో అలంకరిస్తున్న వార్డెన్‌తో "బాబాగారు వస్తున్నారు. సాయంకాలం నాలుగు గంటలకు ఇక్కడ వుంటారు." మేడమ్ చెప్పింది.

అత్యంత ప్రీతికరమైన వార్త విన్నట్లు, వార్డెన్ ముఖం వికసించింది. వసతి గృహంలో



ని
రెడ్డి
మారి

## కొత్త సీరియల్ ప్రారంభం!

చేయవలసిన ఏర్పాట్లను గురించి వారు చర్చించుకొనుచుండగా నళిని, వాసవీలు అక్కడినుండి తప్పుకున్నారు. బాబాగారి ఆగమన వార్త గాలికంటె వేగంగా పయనించింది. మింటిలోనుండి నక్షత్రాలుద్భవించినట్టు, మట్టిలోనుండి మగువ లవతరించినట్టుగా ఎటు చూసినా అమ్మాయిలు మందిరము ఆవరణలో పరిసరాలను శుభ్రపరుస్తున్నారు. కొందరు రంగవల్లులు దిద్దుతున్నారు. మరికొందరు అలంకరణకు పూనుకున్నారు. పరిశుభ్రమైన తెల్లటి వస్త్రాలను ధరించిన మల్లెపూవులవంటి మధురాంగనలు తమ పనులలో నిమగ్నమై చకచకమని తిరుగుతుంటే చూడముచ్చటగా వున్నారు. జల తస్కరుడు జరజరమని పైకి వచ్చేస్తున్నా, ఆ ఎండ వారిని బాధించడంలేదు. ఉత్సాహంగా ఎవరి పనులు వారు నిర్వర్తిస్తున్నారు. ఆ వసతి గృహంలో ఒక గది తలుపులు మూసుకునివున్నాయి.

"వాసవీ! వుక్కతో వళ్ళు చిటపటమంటుంది. కాస్త తలుపులు తెరువు."

"మనవాళ్ళందరు పనుల్లో వున్నారు. గదిలో మనల్ని చూస్తే బాగుండదు."

"ఎందుకు బాగుండదు? మనమేకాదు. మనలాంటి వారు కొందరు అక్కడక్కడ గదుల్లో దూరివుంటారు. అయినా ఇంకో రెండురోజుల్లో ఇక్కడినుండి విముక్తి లభిస్తున్నదికదా! ఇంకా జంకెందుకు?"

పెట్టెలో బట్టలను సర్దుతూ నళిని అన్నది.

"ఇప్పుడు మనల్ని గురించి పెద్దగా పట్టించుకోరు విద్యామందిరాన్ని వదలి వెళ్ళేటప్పుడు చాలా మంచిగా ప్రవర్తిస్తారు. ఆ 'మంచి'ని మనం గుర్తుంచుకోవాలని."

అలమారలో నుండి పుస్తకాలు తీసి చెక్కపెట్టెలో సర్దుతున్న వాసవి "క్లాసు పుస్తకాల కంటె నవల లెక్కువగా వున్నాయి. ఇవన్నీ మోసుకుపోవలసిందే?" భయం అభినయించింది.

"ఆఁ... ఆఁ... నా నవలలు జాగ్రత్తగా వుంచు. మన పిల్లలకి పనికివస్తాయి. అలాగే నీ పాతచీరెలు కూడా పెట్టెలో వేసేయ్. సిల్కువి కాదు కాటన్‌వి." చిలిపిగా చూస్తూ పెదాలు బిగబట్టింది నళిని.



# నళిని

వాసవి వెనక్కితిరిగి విస్మయంగా చూసింది. అలాగే తనకేసి చూస్తున్న వాసవిని చూసి ఫక్కున నవ్వింది నళిని.

"ఎవరి పిల్లలు?"

"మన పిల్లలు."

'నళినీ! మనం పూర్తిచేసింది బి. ఏ.! ఒట్టి రెండక్షరాలు. చదువింకా పూర్తికాలేదు. అప్పుడే పిల్లలంటున్నావు." పుస్తకాలు సర్దుతూ పలికింది వాసవి.

"మై డియర్ వాసవీ! చదువుతో పెళ్ళిని ముడిపెట్టుకుంటే అగా నట్టే! ఇప్పట్లో మన పెళ్ళి కాదు. నాకు మాటలు రాకముందు నుంచి చదువు మాట వింటున్నాను. పాలు త్రాగే నోటితో అ ఆ లు, ఎ బి సి డి లు పలికించారు. చాలు బాబు చాలు. ఈ డిగ్రీ రుచి చూశా . ఇక జీవితాన్ని చదువుదాము వాసవీ! ప్రేమ ... పెళ్ళి..."

"పెళ్ళి పెళ్ళి అని మరీ మరీ అనకు బాబూ! నాకు భయం!"

"ఏం? పూర్వం ద్రౌపది 'భర్త, భర్త' అని ఐదుమార్లు పలికి ఐదుగురు భర్తలను పొందినట్లు పెళ్ళిని గురించి తలచుకుంటే త్వరగా పెళ్ళవుతుందని భయపడుతున్నావా?"

"ఐదుగురు భర్తలను కట్టుకుని మాత్రం ఏం సుఖపడిందిలే! అయినా భవిష్యత్తును గురించి ఆలోచించడంకంటె వర్తమానంలో బ్రతకడమే నాకు ఆనందం."

"........"

"నళినీ! ఏదో ఆలోచిస్తున్నావు. మనసు వరాన్వేషనలో పడిందా?"

"కాదు! ద్రౌపది మనసు ఎలాంటిదా అని?!"

"ఎందుకో అంత దీర్ఘాలోచన!"

"ఏం లేదు. 'లవ్ ఆట్ ఫస్ట్ సైట్' అన్నాడో కవి. 'ప్రేమ' అనేది మనసులో మొదటి చూపులోనే పదిలమవుతుందట. బ్రాహ్మణుని వేషంలో వుండి మత్స్య యంత్రమును పడగొట్టినప్పుడే తన మనసును అర్జునుని కర్పించి వుంటుంది ద్రౌపది. మిగిలిన నలుగురు ఆమెపై ఎంత మక్కువజూపినా వారి యెడ అంత ప్రేమ కనబరచదు. ద్రౌపదిని ఎక్కువగా ప్రేమించి ఆమె కోరికలను, శపథాలను నెరవేర్చింది భీముడు. ద్రౌపది ముచ్చటపడిన సౌగంధికా పుష్పాన్ని యక్షులతో పోరాడి తెచ్చాడు. అజ్ఞాతవాసంలో వుండగా ద్రౌపది నవమానించిన కీచకుని చంపడానికి పనిమంది చూస్తుండగా వృక్షాన్ని పెకలిస్తాడు. దుశ్శాసనుని రక్తాన్ని తెచ్చి కురులకు పూసి శపథాన్ని నెరవేర్చుతాడు దుర్యోధనునికి ఊరుభంగం గావించి అధర్మ యుద్ధానికి పాల్పడ్డాడన్న అపకీర్తి తెచ్చుకున్నాడు. తనకోసం ఇన్ని సాహసాలు చేసిన భీమునిపై గాక అర్జునుని పైనే అధిక ప్రేమానురాగాలు కురిపించింది ద్రౌపది. 'లవ్ ఆట్ ఫస్ట్ సైట్'కు యిది నిదర్శనమేమో!"

"నేనంత దూరం ఎప్పుడూ ఆలోచించలేదు. అయినా ఒక్క ఆడదానిని పాండవు లయిదుగురు ఓర్పుగా ఎలా పంచుకున్నారా అని?"

"ఓసి పిచ్చమ్మా! ద్రౌపది ఒక్కతే అయితే వాళ్ళూ తన్నుకుని చచ్చేవాళ్ళు సుందోపసుందుల్లాగ! పైగా వేరే పత్నులుంటే ఓర్పు వుండదా మరి."

"నకుల సహదేవుల మాటేమిటి మరి?"

"నకుల సహదేవులంటె బుజ్జిబాబులను కున్నావా! వారికీ వున్నారోయ్ ఉపపత్నులు." పకపక నవ్వింది

"ఈ సైన్స్‌తో కుస్తీపట్టకంటే పాడువు కథలు చదువుకుంటే బాగుండేది."

"తెలుగు యం. ఏ. చేస్తాను."

"తెలుగు తీసుకుని ఛందస్సుతో కుస్తీ పడతానంటావా?"

"య, మా, తా, రా, జ, భా, న, స, ల, గం! గురువు, లఘువులు!"

## 'అక్షరాల విశ్వరూపం'

అక్షరాలే కావొచ్చు —  
నా పెదవుల విల్లుమీద  
సంధించి వదుల్తున్నపుడు,  
తలలో పూలజల్లులయ్యే...  
తలలో శూలాలయ్యే...  
బాణాలవుతాయ్!

అక్షరాలే కావొచ్చు —  
నా పెదవుల అడవిలో  
జన్మించి వీస్తున్నపుడు,  
నేత్రాల్లో తుఫాన్లు విసిరే...  
నేత్రాల్లో ప్రాణవాయువులు పులిమే..  
గాలులవుతయ్!

అక్షరాలే కావొచ్చు —  
నా పెదవుల కేంద్రం మీద  
విచ్చిత్తి అయి ప్రవహిస్తున్నపుడు,  
గుండెల్లో మంటలుగా మారే...  
గుండెల్లో బల్బులుగా రూపరే...  
విద్యుత్తు లవుతయ్!

— నందిని సిధారెడ్డి

"అయ్య బాబోయ్ వద్దు!" భయం అభినయిస్తూ చకచక పుస్తకాలు సర్దేసి పెట్టె మూతవేసింది వాసవి.

సూట్‌కేసు మూసి టైం చూస్తూ "పద పద భోజనశాల ఆహ్వానిస్తున్నది. ఆత్మారాముడు అలమటిస్తున్నాడు. బాబా వస్తున్న రోజు. ఈవేళ స్పెషల్."

"బాబా భోజనంబు  
భలే భోజనంబు  
బహు మంచి భోజనంబు  
హా... హా... హ్హా.. హ్హా..."

దీర్ఘంతీస్తూ అభినయించింది నళిని. నవ్వుతూ బయటకు నడిచింది వాసవి.

*    *    *

ప్రొద్దు ఏటవాలింది!

బాబాగారు వచ్చారు. కళాశాల పెద్దలు వెళ్ళి సుస్వాగతం పలికారు. మెత్తటి తివాసీలపై నడచివచ్చిన బాబాగారి పాదధూళి తీసుకుని నుదుట దిద్దుకుని, సాష్టాంగదండ ప్రమాణాలు చేసి ఆశీర్వాదాలు పొందారు భక్తులు. బాబాగారు ముఖమల్ దిండ్లు అమర్చిన ఆసనంపై కూర్చున్నారు. కళాశాల ప్రముఖులు, ఆహూతాతిథులతో సభ నిండుగా వుంది. బాబాగారి సందేశం కొరకు సభికులు శ్రద్ధాభక్తులతో ఎదురు చూస్తున్నారు. సభ నిశ్శబ్దంగా వుంది.

బాబాగారు సభను కలయజూసి కంఠం విప్పారు.

"దివ్యాత్మ స్వరూపులారా!" ఆ కంఠం మృదుమధురంగా పలికింది.

"మీ అందరిని కలుసుకున్న నేడు, సుదినం! ఈ కళాశాలను స్థాపించడంలో ముఖ్యోద్దేశం, విద్యార్థి దశలోనే మీలో ఆధ్యాత్మికచింతన ద్వారా మనోవికాసాన్ని కలిగింపజేయడమే! మీలో ఆధ్యాత్మిక భావనలను చిగురింపజేసి నైతిక విలువలను పెంపొందించడమే! భవితవ్యంలో కూడా ఈ కళాశాలను ఆధ్యాత్మిక నియమాలతో నడపాలని మా కోరిక.

ప్రేమస్వరూపులారా! విదేశీయుల పాలనలో భారతదేశమునందున్న దేశ విద్యకు, పండితులకు, ప్రాముఖ్యత నశించి, ప్రజలకు పండితులకు మధ్య సుహృద్భావము లేక వేద విద్య పునరుద్ధరణకు ప్రయత్నమే లేక, పాశ్చాత్య నాగరికత వ్యామోహములో బడి, లౌకిక భోగపరాయణులై ప్రజలు, నీతి వాక్యములనుగాని, పెద్దల ప్రబోధనలను ఆలకింపక అవహేళన జేయ నారంభించిరి.

వేదాధ్యయనమును, సనాతన ధర్మానుష్ఠానమును, నిరాడంబరతను, ఉన్నతాదర్శములను, భక్తి జ్ఞాన వైరాగ్యములను, వినిర్మల నీతిని ప్రజాబాహుళ్యములో విస్తరింపజేయడమే నా అవతార ముఖ్యోద్దేశ్యము.

భారత సంస్కృతి నావరించిన పాశ్చాత్య నాగరికత చీకటిని రూపుమాపి సనాతన ధర్మతేజమును ప్రపంచమున కందించవలసిన అవసర మెంతైనా కలదు.

ప్రకృతి లక్షణములు కృత్రిమములు నీవ లక్షణములలో చిక్కుకుని సహజ లక్షణములను గోల్పోవుచున్నావు. నీవు ఇతరులను ప్రేమించితే వారు తప్పక నిన్ను ప్రేమించగలరు. కనుక నీ హృదయాన్ని ప్రేమతో నింపుము. కఠినమైన పలుకులతో ఇతరుల మనస్సును నొప్పింపకుము. అది హింస అవుతుంది. అహింసా వ్రతము బూని సమ్యక్ దృష్టి కలిగియుండుము. మనస్సనే క్షేత్రాన్ని దున్ని, ఉత్తమ భావాలనే విత్తనాలను వెదజల్లితే, పవిత్రత అనే ఫలితాన్ని మానవునికి అందజేస్తుంది. పవిత్ర జీవనమును గడిపే మనిషి సచ్చిదానంద స్వరూపుడు. ఈతిబాధలకు అధైర్యపడక, కష్టసుఖాలలో కూడా మానసికానందము ననుభవిస్తూ స్థితప్రజ్ఞుడవుతాడు. మనస్సున కొక విచిత్ర గుణమున్నది. మానవుడు ఒక విషయమును గురించి ఎల్లప్పుడు

# చెమటకాయల యొక్క దురద, మంట బాధను మరిచి పోండి.

నైసిల్
ఉపయోగించండి.
అతిశీఘ్రంగా
ఉపశమనమునిచ్చే
చెమటకాయల పౌడరు






2 ప్యాక్‌లలో
దొరుకును —
"బ్లూ" మరియు
"శాండల్ వుడ్"

**నైసిల్ పొందండి.**
**చెమటకాయలను మరువండి.**
**కేవలం 6 రూపాయల 63 పైసలు.***

*గరిష్ఠ రీటైల్ ధర. స్థానిక పన్నులు అదనం

చెమటకాయల పౌడర్
మాత్రమే మీకు దురదలు, మంటల
చికాకుల నుండి అతి శీఘ్రంగా
ఉపశమనము నిస్తుంది.
ప్రత్యేకమైన ఔషధీయుక్త నైసిల్
చెమటకాయలను ప్రతి దశలోనూ
ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను ఆపుతుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధకారియైన సూక్ష్మ జీవులను నాశనము చేస్తుంది.
4. శరీరమునకు ఉపశమనము నిస్తుంది.

Sista's-GN-79-364-Tel

# నళిని

తలమకుంటే అది మనముపై ముద్రిత మవుతుంది. ఉదాహరణకు కోపిష్టి లయినవాడు తనయందలి 'క్రోపము' నశించాలి అని చింతిస్తే అతనికి కోపము అధికమవుతుంది. 'శాంతము' కావాలని ధ్యానిస్తే శాంత మలవడుతుంది. కావున మనుజుడెప్పుడు ఉత్తమ గుణములనే తలపోస్తూ ఉత్తమగతిని చరించవలెను. ఇతర ప్రాణులన్నియు తనవంటివేననెడి సమభావము నలవరచుకొనవలెను. కేవలము వ్యక్తిగత సుఖమునకై భగవంతుని ప్రార్థింపక 'సర్వే జనో స్సుఖినోభవంతు' అనెడి విశాల భావంతో భగవన్నామస్మరణ చేయవలెను..."

బాబా అలా సాఫీగా పారే గోదావరిలా నెమ్మదిగా బోధిస్తూవుంటే శ్రోతలెల్లరు నాగస్వరానికి కట్టుబడిన కోడెనాగులవలె తలలాడిస్తూ తన్మయత్వంలో తేలిపోతున్నారు

భక్తిపారవశ్యంతో ఒక యువతి 'ఉన్నది ఒకే కులం — అది మానవత్వం. ఒకే మతం — అది ప్రేమ. ఇక్కడున్నది ఒకే దేవుడు. రామా, రామా' హిందీలో అంటూ చేతులు జోడించి, అర్ధనిమీలిత నేత్రాలతో సాక్షాత్ భగవత్స్వరూప మును గాంచినట్లు పరవశించిపోయింది.

ఆ అమ్మాయి చాక్షుష భ్రాంతికి నళిని పెదవులపై చిరునవ్వు నాట్యమాడింది.

మనిషికో పిచ్చి. ఆ పిచ్చి మరీ కాస్త ఎక్కువగా కనిపిస్తుంది కొందరిలో కంటికి కనిపిస్తున్న బాబా సాక్షాత్ దేవుడని నమ్ముతారు. అది వారి నమ్మకము. ఆ నమ్మకము మరికొందరి దృష్టిలో చాదస్తముగాను, భ్రాంతిగాను భావిస్తారు. 'మనిషి దేవుడు కావటమేమిటని' కొట్టిపారవేస్తారు! ఈ బాబాలందరు ఏవో కొన్ని శక్తులు, మహిమలు జూపి సామాన్య ప్రజలను భ్రాంతుల గావించి, పురాణ పురుషులమని చెప్పుకుంటూ మోసపుచ్చుతున్నారని వీరి వాదన. భగవంతుని దృష్టిలో సమస్త మానవాళి సమానమని, సర్వప్రాణులు తన బిడ్డలేనని బోధిస్తున్నప్పుడు కంటి కెదురుగా కనిపిస్తున్న ఈ తారతమ్యాలెందుకు ? ఉన్నవాడి స్థితి ఉట్టి కెక్కితే లేనివాడి గతి మరీ దిగజారుతున్నది. భగవంతుడనని చెప్పుకునేవాడు వీరి స్థితిగతులను మార్చలేడా ? అని సూటిగా ప్రశ్నిస్తున్నారు. కంటి కగుపిస్తున్నదే నిజం. ఈ ప్రపంచంలో అనుభవిస్తున్న ఆనందమే ఆనందం. అది ఇక్కడగాక మరెక్కడో, ఎప్పుడో లభిస్తుందను కోవడం భ్రమ. ఆ భ్రమకు లోనుగాకూడదని వీరి వాదన. భగవంతుని ఉనికిని వీరు ఒప్పుకోరు. వీరిని నాస్తికులన్నారు ప్రజలు.

వీరి వాదనను ఖండిస్తూ, బాబా భగవంతుడనే తమ నమ్మకమును సమర్థిస్తారు బాబా భక్తులు ప్రజలెల్లరు భగవత్స్వరూపులుగా భావించి పూజించే రాముడు, కృష్ణుడు కూడా మానవులేనని, ధర్మస్థాపనార్థమై భగవంతుడు అవతరించి యుగ ధర్మమును నిలువుతున్నాడని వీరి వాదన.

అలాగే బాబాగారు కూడా సాక్షాత్ భగవత్స్వరూపులని, ధర్మమును నెలకొల్పుట కవతరించిన అవతారపురుషు డంటారు. కేవలపు కొన్ని మహిమలు, శక్తులు ప్రదర్శించినంత మాత్రమున మనిషి, దేవుడెలా అవుతాడన్న ప్రశ్నకు సమాధానమిది ! బాబాగారు చతుష్కారములతో, సామాన్యునకు సైతము ముక్తి మార్గమును జూపుచున్నాడు.

చతుష్కారములలో మొదటిది; చమత్కారము. (దీనిని 'మిరాకిల్' అని అంటారు.) ఈ చమత్కారములవల్ల ముందుగా మనిషిని తనవైపుకు ఆకర్షించుకోవటమే దీని ముఖ్యోద్దేశ్యం. వింతలు విన్నా, కన్నా ఆ వైపుకు వెళ్ళడం మానవ సహజం. కాని చాలామంది ఈ చమత్కారములకే ప్రాముఖ్యతనిస్తున్నారు.

అలా ఆకర్షింపబడ్డ మనిషిని సంస్కరించి, బోధించి జ్ఞానోపదేశము గావించడం సంస్కారం. సంస్కరించబడ్డ వ్యక్తి మంచి—చెడులను గుర్తించ గల విచక్షణాజ్ఞానం కలిగివుంటాడు.

జ్ఞానోపదేశం చేశాక పరుల కుపకారము చేయమని మానవజన్మ కది సార్థకత చేకూర్చ గలదని "పరోపకారాయ పుణ్యాః — పాపాయ పర పీడనం" అంటూ పరుల కుపకారము చేయడం



పుణ్యమనీ, ఇతరులను పీడించడం పాపమని, కాబట్టి పరోపకారం చేయమని ఆదేశిస్తాడు.

ఈ విధంగా మనిషి పరోపకారము చేయడము వలన ఆత్మసాక్షాత్కారం, తద్వారా దైవ సాక్షాత్కారం పొంది తానుకూడా దైవస్వరూపుడు కాగలడని ఉపదేశిస్తాడు.

బాబాగారు భగవంతుడా ? కాదా ? అనే విషయమై వాదోపవాదన లెలా వున్నా, వారి బోధన లెల్లరికి ఆమోదయోగ్యములే. వ్యక్తి మనోవికాసానికి ఆధ్యాత్మిక చింతన ఎంతో ఉపకరిస్తుందన్న సత్యము అందరు గ్రహించ వలసినదే. దీనివలన లౌకిక సుఖ దుఃఖముల బారి నుండి మానవుడు తప్పించుకుని శాంతియుత మైన జీవనము గడపుట కవకాశమున్నదని బాబా భక్తుల సమాధానము.

ఇలా వీరి వాదోప వాదనల వలన, ఏది సత్యమో, ఏది సత్య దూరమో, ఏది ఆచరణ యోగ్యమో, ఏది కాదో అర్థముగాని అయోమయ స్థితిలో సామాన్య మానవుడు పరిస్థితులనుబట్టి ఎప్పటికేది తన కవసరమో ఆ మార్గాన్ని అవలంభిస్తూ సంశయాత్మకుడవుతున్నాడు.

"తుఫాన్‌ను గద్దించి, సముద్రముపై నడచి, చనిపోయినవారిని పునరుజ్జీవితుల గావించిన ఏసుక్రీస్తు తాను దేవుడినని చెప్పుకోలేదు." ఒక క్రిష్టియన్ అమ్మాయి తలచింది.

ఉపన్యాసమును అప్పటికి ఆపిన బాబా చూపులు ఆ క్రిష్టియన్ అమ్మాయిపై నిలచి పోయినవి. ఆ అమ్మాయి మనసులోని మాట గానెరిగినట్లు మెత్తగా నవ్వారు. ఆ అమ్మాయి కళ్ళు క్రిందకు వాలింది.

బాబా తిరిగి కంఠం విప్పారు. చూపులు పెద్దలపై నిలచినవి. ఆరోజు వారికిచ్చే సువార్త—

"అన్ని యుగముల కన్న మిన్నగా
ఈ కలియుగములో
నామస్మరణచే భగవంతుని పొందు అవకాశ
మున్నది. భగవన్నామ సంకీర్తనచే
ప్రతిధ్వనించు
వాతావరణంలో మానవుల అహంకార
దుర్వాసనలు
నశించును. ముక్తకంఠంతో సంకీర్తన
గావించండి."

గాన కంఠస్వరంలో నామ సంకీర్తన మొదలిడి శ్రోతల హృదయాలు రంజింపజేశాడు. సభికులు అందుకున్నారు.

"శ్రీరామ జయరామ జయ జయ రామ !
హరేరామ హరేరామ రామ రామ
హరే హరే !
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ
హరే హరే !"

ఆత్మానందంతో భజన అలా సాగిపోయింది కాలాన్ని ఎవ్వరూ గుర్తించలేదు. దివ్యమంగళ స్వరూపానికి భక్తులు చేతులెత్తి నమస్కరించారు.

భక్తితో నళిని నమస్కరిస్తుంటే "నీవూ డివోటీస్‌కి తీసిపోలేదు" వాసవి వుడికిస్తున్నట్టు కొంటెగా అన్నది.

"మనకంటె పెద్దవారు, మానవాతీత శక్తులున్నవారు. 'మంచి'ని బోధించేవారు 'పూజార్హుడే' అని సమర్థిస్తాను."

"నీవు మాటలు నేర్చినదానవు."

అమ్మాయిలు బాబా చుట్టు గుమికూడారు. భక్తులు ఆయనకు హారతినిచ్చారు. ఆశీర్వదిస్తున్నట్టుగా వారిపైకి విబూదిని అరచేతి మీదుగా వూదారు బాబా.

"ఇది మాయా ? భ్రాంతా ?" ఈ ఇంద్రజాలం ఎప్పుడూ క్రొత్తగా వుంటుంది" ప్రశ్నించింది వాసవి.

"నీవు దుర్యోధనున్ని తలపింపజేస్తున్నావు నీలాగే దుర్యోధనుడు శ్రీకృష్ణుడిని 'ఇంద్ర జాలకుడివి — మాయావి, నీ ఇంద్రజాలానికి నేను బెదరను' అని నిందించేవాడట" నళిని చమత్కరించింది.

ఇద్దరు సంభాషించుకుంటూ భోజనశాల వైపు నడిచారు. అక్కడ అమ్మాయిలు బాబా తిని వదలిన ఎంగిలిమెతుకుల ప్రసాదంకొరకు ఎగబ్రాకుతున్నారు.

* * *

ఉదయభాస్కరుడు వురిమి చూస్తున్నాడు. ప్రొద్దు పైకెక్కలేదు. అప్పుడే మండిపోతుంది ఎండ.

# ఇప్పుడు! హాయిగా సేవించండి సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ!

## లిప్టన్ టాప్ స్టార్ టీ

చిక్కని కమ్మని టీ కోసం నిజంగా మీరు ఎదురు చూస్తున్నారు. అదే క్రొత్త లిప్టన్ టాప్ స్టార్. అత్యుత్తమమైన మంచి ఎగుమతి రకం డస్ట్ టీ రకాలను మేళవించి చిక్కటి కమ్మని టీ కోసం చూచే మీలాంటి వారి కోసమే యీ టీ. నేడే లిప్టన్ టాప్ స్టార్ కావాలని అడగండి. పూర్తిగా ఫాయిల్‌లోనే ప్యాక్ చేసారు గనుక తాజాగా, చిక్కగా, కమ్మగా మీరు కోరినట్లు వుంటుంది.




LT/CAS-1/77R TEL

**సంతృప్తి నిచ్చే స్ట్రాంగ్ టీ**

పరీక్షలు ముగించినవారు ఆ కళాశాల నుండి బయటపడుతున్నారు. డిగ్రీ క్లాసు విద్యార్థినులు 'ఈ కళాశాలకు స్వస్తి చెబుతున్నా'మని ఓ ప్రక్క దిగులుపడుతున్నా మరో ప్రక్క చదువు ఓ దారికి వచ్చిందని సంతోషిస్తున్నారు.

కాలేజి ఆవరణ నుండి బయటకు వస్తుంటే ఆత్మీయులకు దూరమవుతున్నట్లు బాధపడుతూ వీడ్కోలు తీసుకుంటున్నారు. బయటి ప్రపంచానికి రాగానే రెక్కలు విప్పుకుని ఎగిరే పక్షుల్లా వున్నాయి వారి మనసులు. ఆ వాతావరణం నుండి బయటకు వస్తూ దీర్ఘంగా గాలి పీల్చి వదలింది నళిని. స్వాతంత్ర్యపు బావుటా ఎగురవేసినట్లు పైట గాలిలో రెపరెపలాడింది. నీలాల నింగివైపు చూసింది ఆనందంగా! సూర్యకిరణాలు సూటిగా కళ్ళలో గ్రుచ్చుకున్నాయి.

"పాపం! సంజ్ఞ ఆనాడు ఇలాగే కళ్ళు మూసుకుని వుంటుంది. తేజస్సు తగ్గించుకోక ముందు ఈ భాస్కరుడింకెంత తీక్షణంగావున్నాడో మరి!" అప్రయత్నంగా కళ్ళు మూసుకుంటూ పలికింది నళిని.

"తగ్గించబడిన ఆ తేజస్సుతో శంఖు, చక్ర, త్రిశూలాలు చేసిచ్చాడు విశ్వకర్మ. సైంటిస్ట్ వాసవీ! అది ఏ లోహమై వుంటుంది?" చిలిపిగా అడిగింది నళిని.

"సూర్యకిరణాలు పసిడివర్ణం గనుక అది బంగారమై వుంటుంది."

"ఏసీ! అయితే తమరు సూర్యకిరణాలపై రిసెర్చ్ చేస్తారా?"

"తమరు వరాన్వేషణ చేస్తారా?" కొంటెగా పలికింది వాసవి.

"తప్పదు మరి. నీకేం? నీ మొగుడు పుట్టిపెరుగుతున్నాడు హాయిగా, దిగుల్లేకుండా వున్నావు."

"అబ్బ... 'మొగుడు' అని అంత మొరటుగా మాట్లాడకు. ఎలాగో వుంటుంది."

"ఉడ్‌బీ, హబ్బీ కంటే బాగాలేదా?"

"ఉడ్‌బీ కాదు, హబ్బీ కాదు. బావ మాత్రమే!"

"ఆ బావ నీకోసమే. నీ... అవలేదూ?"

"అన్నారనుకో."

"వాసవీ! నీ ఆరో ప్రాణమైన నాకు తెలియదా! నీ మనసు బావమీద వుందని!"

వాసవి ఏదో చెప్పబోయింది. అంతలో బస్ వచ్చింది.

చకచక సామాను అందించుకుంటు, బస్సు ఎక్కి సర్దుకున్నారు.

వారి హడావిడి చూస్తున్న కమల "హంస — డిభకులు" అంటూ పిలిచింది.

"గుడ్ మార్నింగ్ మేడమ్" ముక్తకంఠంతో పలికారిద్దరు.

"గుడ్ మార్నింగ్! సెలవుల్లోనైనా హంస డిభకులు విడిపోక తప్పదు."

"నో మేడమ్! మీ అంచనా తప్పింది. మా ఎడబాటు ప్రస్తుతానికి వాయిదా పడింది.

# నళిని

నళిని నా వెంట మా వూరికి వస్తున్నది." వాసవి నవ్వుతూ చెప్పింది.

"ఒక వారం రోజులే మేడమ్! తరువాత ఇద్దరం హైద్రాబాదు వెళ్ళుతాం. ప్రస్తుతానికి అదే మా పుట్టినిల్లు" నళిని హాస్యంగా పలికింది.

మిస్ కమల తెలుగు లెక్చరర్. నళిని, వాసవిలతో సరదాగా నవ్వుతూ నవ్విస్తూ ఆనందంగా గడుపుతుంది.

"తర్వాత ఏంచేద్దామనుకుంటున్నారు?" మేడమ్ ప్రశ్నించింది

. "వాసవి బావను పెళ్ళి చేసుకుని పిల్లల్ని కంటుందిట మేడమ్. నాకు మరో రెండేళ్ళు ఈ చదువు తప్పనట్టుంది."

పెదాలు బిగపట్టి నవ్వునాపుకుంటూ కొంటెగా వాసవి వైపు చూసింది.

వాసవి బుంగమూతి వైపు చూసి పకపక నవ్వింది మేడమ్!

అంతలో బస్సు అటువైపు వచ్చి సరిగ్గా అబ్బాయిల కాలేజి ముందు ఆగిపోయింది. డ్రైవరు పలురకాలుగా 'హార్న్' ఇస్తూ హెచ్చరిస్తున్నాడు.

"బజారును, రకరకాల మనుషులను చూసి ఎంతకాలమైంది? ఇప్పుడే బయటి ప్రపంచాన్ని చూస్తున్నట్టుంది." నళిని మనసులో మాట పైకి అనింది.

బస్సు నిండుగా అమ్మాయిలు. వారిని చూస్తూ బాయ్ స్టూడెంట్స్ హుషారుగా నవ్వుతూ, అమ్మాయిలపై కామెంట్ చేస్తూ ఆనందిస్తున్నారు. డ్రైవరు బస్సును స్టార్ట్ చేయ ప్రయత్నిస్తున్నాడు. కాని నసేమిరా కదల్నంటుందది.

"'హంస' పాదం పెట్టింది కదరా! ఇంకెలా కదులుతుందది. ఆదిలోనే హంసపాదన్నారు పెద్దలు. వెనుకటికి ఈవిడలాంటి ఆవిడే పాదం మోపి వుంటుంది. అందుకే ఈ 'సూక్తి' వచ్చివుంటుంది." జోక్ చేశాడొక కుర్రాడు.

చప్పట్లుచరిచి గట్టిగా నవ్వారు విద్యార్థి బృందం.

"తకల్నారే" డ్రైవరు అరిచాడు.

కండక్టరు బస్సు దిగి, ముందుకు త్రోయమని కనిపించిన వాళ్ళందరిని అడుగుతున్నాడు. 'సాయిరామ్! సాయిరామ్' అని నవ్వుతూ ప్రక్కకు తొలగి నవ్వుకుంటున్నారు విద్యార్థులు. మరికొందరు 'గోవింద' కొడ్తున్నారు.

లాభంలేదు. బస్సు కదలాలంటే త్రోయాల్సిందేనన్నాడు డ్రైవరు.

భుజాలనిండుగ పైటచెరుగులు తీసి బొడ్లోకి దోపి 'రండి ఓ పట్టుపడదాం' అంటూ అమ్మాయిలను ప్రోత్సహించింది నళిని.

అమ్మాయిలు సిగ్గుతో ముఖం దించుకుని నేల చూపులు చూస్తూ సందేహిస్తున్నారు. 'బస్సును మనం తోస్తే కదులుతుందా? కదలకపోతే ఆ అబ్బాయిల ముందు సిగ్గుతో చచ్చిపోవాలి' అనుకుంటూ!

వారి హావభావాలను గుర్తించిన నళిని "డిగ్నిటీ ఆఫ్ లేబర్! మన పని మనం చేసుకోవటంలో తప్పులేదు. రాజకుమారి, సుకుమారియైన జనకరాజ సుత సీత — రావణాసురుడు ఎత్తిపట్టి విరచలేని శివధనుస్సును అవలీలగా ఎత్తగలిగింది. 'మై డియర్ దివ్యాత్మ స్వరూపులారా!' అబల, ఒంటరిది అయిన ద్రౌపది తనను పట్టి బలాత్కరించబోయిన సింహబలుని ఒక్క తోపు త్రోసి తప్పించుకుని వెళ్ళింది. మరి మనమందరం కలిసి ఈ బస్సును రోడ్డుపైకి త్రోయలేమా? కమాన్! రండి" అంటూ చిన్న లెక్చర్ దంచి ప్రోత్సహించింది నళిని!

మేడమ్ చప్పట్లు చరిచి 'కమాన్ గర్ల్స్' అంటూ పిలిచింది.

బస్సును, డ్రైవరును కలిపి తిట్టుకుంటు ముందుకు తోశారు.

వారి నెక్కువ శ్రమపెట్టట మిష్టంలేక కాబోలు బస్సు తొందరగానే 'స్టార్ట్' అయింది.

టౌన్ బస్ స్టాండ్‌లో నళిని, వాసవి దిగారు. మేడమ్‌కి గుడ్‌బై చెప్పారు.

"మీరు సెలవుల్లో హాయిగా, ఆనందంగా గడపాలి. హ్యాపీ లైఫ్" అంది.

థ్యాంక్స్‌తో బాటు 'టా—టా' చెప్పారు మేడమ్‌కి.

పెనుకొండ బస్సు వచ్చి ఆగగానే ముందు నళిని వెళ్ళి సీటు ఆక్రమించుకున్నది.

వాసవి టిక్కెట్లు తీసుకుని అలసిపోయినట్లు వచ్చింది.

మండుతున్న వేసవిలో పాంథుని పరుగువలె వేగంగా సాగుతున్నది బస్సు. నవ్యమైన రోడ్డుపై ప్రయాణం అంతగా ప్రయాస కలిగించదు.

బాట కిరువైపుల రాళ్ళు పరచుకున్న మైదానం. అక్కడక్కడ రాళ్ళు ఒకదానిపై ఒకటి పేర్చినట్లుండే కొండలు చూస్తూ "ఇది నిజంగా రాళ్ళసీమ. రాయలసీమేంది" అంది నళిని.

"కాదు రత్నాలసీమ, రాళ్ళసీమ అయినది" ప్రత్యుత్తరమిచ్చింది వాసవి.

దూరం నుంచి పెనుకొండ కోటను చూశారు.

"ఆ కోటను కట్టించెవరో?" ప్రశ్నించింది నళిని.

"విజయనగర రాజులు ఆ కోటను నిర్మించారు. కాని వేంకటపతిరాయల కాలంలో గోల్కొండ నవాబు పెనుకొండపై దాడి జరిపి ఆక్రమించుకున్నాడు వేంకటపతిరాయలు చంద్రగిరికి పారిపోయాడు."

"ఏసీ! చరిత్ర రిపీట్ అవుతుందిగదా! మరి ఆ గోల్కొండ నవాబును ఎవరు తరిమివేశారు?"

"నాది సైన్స్ గ్రూపు."

"ఓహో"

"అండర్‌స్టాండ్"

"...స్టాండ్"

గట్టిగా నవ్వుకున్నారిద్దరూ.

[ఇంకా వుంది]

# ప్రశ్నావళి

— కె. రామలక్ష్మి

ఎమ్. ఎమ్. ఆర్ — మంగళగిరి

రచయిత తన రచనలో ఏమైనా సందేశాలిస్తే వాటిని చేసి చూపిస్తాడా? చేసి చూపించాలని వున్నా పరిస్థితులు అనుకూలించకపోతే ఆ రచయిత క్షమార్హుడా?

★ రచయిత మెజిషియన్ కాదు. తన ఆశలని ఆదర్శాలని తన సృష్టిలో — విశదీకరించ వచ్చు. పాత్రల ద్వారా అందుకొన్నట్టూ చూపించవచ్చు ... కాని ప్రతిదీ నిరూపించి చూపించడమన్నది అర్థంలేని మాట. రచన ఊహాకల్పన. దానిలోనే తన వ్యక్తిత్వాన్ని పొదిగి ప్రత్యేకత సంతరించుకోవాలని ప్రతి రచయితా తాపత్రయపడతాడు. అంతేగాని ప్రతీదీ అనుభవం అనుకోకూడదు. పాఠకులిలా — రచయిత అనుభవాలే రచనలు అనుకుంటూపోవడంవల్ల కూడ చాలా సాదా సీదా సంసారిక నవల — మూడు పూవులూ ఆరుకాయలుగా బ్రతికేస్తోందీవాడు. ఆవిడగారి కెలా తెలుసు? అన్న ప్రశ్నతో పాఠకలోకం రచయితల ప్లాట్స్‌కి కూడా పరిధి వేసేస్తారు కొన్ని సందర్భాలలో. అందుచేతనే కూడ స్త్రీలు విప్లవాత్మకమైన కథలు సృష్టించలేక పోవడం (మగ స్త్రీల సంగతికాదు నేను చెప్పేది.) వ్యభిచారం, లేచిపోవడం, కన్నెతల్లి, ఉంచుకున్న మనిషి వీటిలాంటివి — కత్తిమీద సాములాగా తయారవుతున్నాయి

ప్రసాద్ — మాళ్ళూరుపేట

"జీవితం జాతీయ రహదారి అయితే అదృష్టం రైలు గేటు లాంటిది. నీవు వచ్చినప్పుడు తీసి వుండవచ్చు. నేను వచ్చేప్పుడు మూసి వుంది." అంది కథకురాలైన స్నేహితురాలు.

★ కథకురాలన్నారు కనుక సరిపోయింది. మొన్న బస్సు ట్రాజడీ విన్నదగ్గరనుంచీ గేటు — అందునా రైల్వే గేటు అంటే — సింహస్వప్నంలాగా వుంది. మనం వచ్చినప్పుడు మూసివుండడం అదృష్టంగా భావించాలి అనుకున్నాను!

ఏ. వి. — శ్రీహరికోట

బంధమోక్షములు ఎవరికి?

★ పెద్దవారు నన్నడగాలా స్వామీ! జీవికి ఆత్మ సంగతి మోక్షం తరువాత జీవికి అప్రస్తుతం కదా?

కె. వి. డి. — ఎన్‌బివిపాలెం

రూపం గొప్పదా? గుణం గొప్పదా? ఈ రెండూ కలిసి మనిషిలో వుండడం అరుదు. రూపం బాగావే వుందని పెళ్ళి చేసుకుంటే గుణం ఎలా వుంటుందోనని అనుమానం?

★ మంచిది నాయనా — అనుమానం మనిషి పెళ్ళి చేసుకోకుండావుండడమే మంచిది. ఓ జీవికి హింస తగ్గుతుంది.

జె. ఎఫ్. — ఒంగోలు

అందరూ అన్యాయాన్ని అలవర్చుకోవాలా? — న్యాయం ఎక్కువసార్లు అన్యాయం ముందు ఓడిపోతోంది.

★ అలా అని అన్యాయాన్ని న్యాయంగా మార్చలేం.

టి. ఏ. ఆర్. ఎమ్. — గుడివాడ

మగపిల్లలతో కలం స్నేహం అంటే చాలామంది ఆడపిల్లలు వెనుకాడతారెందుకు?

★ తొలి వుత్తరాల్లో వున్న స్నేహం మలి వుత్తరాల్లో మార్చేస్తూవుంటారు అని ఆడపిల్లల భయం. అయినా ఆడపేర్లతో ఉత్తరాలు రాస్తూనే వుంటారట అబ్బాయిలు. స్నేహం పెరగాలంటే ఒకరిపై ఒకరికి పూర్తి విశ్వాసం ఏర్పడాలి; ఒకరిపై ఒకరికి గౌరవం వుండాలి.

పి. ఆర్. బి; బి. వి. ఆర్. — సత్తుపల్లి

స్త్రీ అహంకార అహంభావాలకు ప్రతిరూపం అంటాన్నేను మీరేమంటారు?

★ మీతో పేచీ ఎందుకు? ఒప్పేసుకుంటున్నాను!

బి. జి. ఆర్ — సౌత్‌మోపూరు

స్త్రీ జాతిని వుద్ధరించాలని మీరు పక్షపాత బుద్ధితో సలహాలిస్తున్నారు కదా అవి ఎంతవరకు ఫలించాయి అంటారు?

★ 'చేయడం నీవంతు. ఫలితం సంగతి నీకనవసరం కె.రా.' అని కృష్ణపరమాత్మ ఆదేశం. (ఎన్.టి.ఆర్. కృష్ణుడు కాదు సార్, గీతోపదేశం కృష్ణుడు). అంచేత ఎవరేం అనుకున్నా — నా మనస్సులోని భావాలు, నా నమ్మకాలు, నా ఆదర్శాలు, ఆవేదన — అన్నీ వెళ్ళకక్కుతాను. చదివినా సంతోషం. చదవకపోయినా విచారం లేదు.

వి. ఎన్. ఎమ్. — సికింద్రాబాదు

పేదవాడి భోజనానికి గొప్పవాడి భోజనానికి తేడా?

★ పేదవాడు దొరికినప్పుడూ, గొప్పవాడు కావలసినప్పుడూ — తింటాడు! అదీ తేడా.

పి. ఎస్. బి. — హైదరాబాదు

మొండిపట్టుదలలతో సంసారాలు చేజేతులా నాశనం చేసుకుంటున్న స్త్రీమూర్తులకు మీ రిచ్చే ఉచిత సలహా ఏమిటి?

★ అడగ్గానే అర్జెంటుగా ఉచితంగా లభించేదే సలహా! సంసారాలు చప్పట్లులాంటివి. రెండు చేతులూ కలిస్తేనే — చప్పుడు. అంచేత ఓ చెయ్యి ఎప్పుడూ బాదడం — చప్పుడుకాకుండా వుండడంకోసం — రెండో చెయ్యి కదలకవుండడం— న్యాయం కాదే. సంసారాల్లో అల్లకల్లోలాలు — తప్పవీ సంధికాలంలో. పురుషాధిక్యతకే అలవాటుపడిపోయిన కుటుంబాలలో చదువుకుని, ఉద్యోగాలు చేస్తూ — తల్లితండ్రులను కొడుకుల్లాగే పోషిస్తున్న స్త్రీలున్నారు మొగాడిలాగే కొంప కొమ్ముకాస్తున్న — భార్యలున్నారు ... వ్యక్తిత్వం వుంటే ఘర్షణ తప్పదు. ఘర్షణకి భయపడి — చచ్చిన పాముల్లాగా పడివుండక్కరలేదు. ఘర్షణలోంచే హాలాహలం అమృతం పుట్టేవి. ఘర్షణలోంచే — సంసారాల్లో కూడా సంధి సూత్రాలు కుదిరేది. ఆదిలో అలజడి. అంతంలో అర్థవంతమైన — సంసారం రూపందాల్చి తీరుతుంది. దెబ్బలాడుకోనివ్వండి. లోపల్లోపల కుళ్ళుతూన్నకంటే బయటపడడం చాలా మెరుగు. ●



# రహస్యం

విమల.వి



మనసంతా ఉద్వేగంతో నిండివుంది రావుకి –

ఎందుకోసమో తొందరపడుతోందాతడి మనసు. అసహనంగా వాచీ చూసుకున్నాడు – అలా చూసుకోవటం అప్పటికి అది తొంభై ఎనిమిదోసారి –

పదకొండు గ౦టలు!

ఇంత టైమయినా కాత్యాయిని రాదేం గదిలోకి ?

సుమారు ఓ రెండుగంటల క్రితం భోజనాలయేయి. కాత్యాయినికి తన ప్రక్కనే వేసేరు పీట ... చాలా సరదాగా గడిచిపోయింది భోజనాల దగ్గర ... ఎవరో ఓ ముసలావిడ,

“అదేవిట్రా, కొత్త దంపతులు కదా ... ఎంగిలి తినొద్దూ. పెళ్ళాంచేత నీ ఎంగిలి తినిపించవయ్యా” అంది.

రావు మొహంలోకి రక్తం ప్రవహించినట్లైంది.

ఆవిడెవరో ఖచ్చితంగా తన మనసులోని మాటే అంది. అలా తామిద్దరూ ఒకరిచేత ఒకరు తినిపించుకుంటూ భోజనంచేస్తే ఎంత బావుంటుందో! ఇంతలో ఓ ఆదర్శ వనిత,

“ఛ! ఎంగిలి తినడమేవిటి అసహ్యంగా ... అంతగా తినాలనిపిస్తే ముందు ముందు చాలా రోజులున్నాయ్ ... అసలే అది సిగ్గుపడిపోతోంది” అంది.

ముసలావిడ బుగ్గలు నొక్కుకుంటూ వెళ్ళిపోయింది.

కాత్యాయిని ఓ నిట్టూర్పు విడవటం తనకి స్పష్టంగా విన్పించింది. నిజంగానే కాత్యా సిగ్గుపడివుండాలి అనుకున్నాడు రావు.

కాత్యా అన్నలూ, వదినలూ వేళాకోళాలతో, వెక్కిరింపులతో గ౦ట తిన్నారు ... నిజానికి తామిద్దరూ అసలేం తినలేకపోయేరు – ఉట్టినే కెలుకుతూ కూర్చున్నారు –

కాత్యా కూడా తనలాగే తాము యిద్దరూ గడపబోయే మధురమైన క్షణాల్ని తల్చుకుంటుందేమో అన్న భావన రాగానే అతనికి నవ్వొచ్చింది!

ఆ తర్వాత రావు తల్లి కాత్యాకి పట్టుచీర పెట్టింది – కాత్యా తండ్రి రావుకి కొత్త బట్టలు పెట్టేడు.

రావు కొత్త బట్టలు ధరించేడు – కాత్యా పట్టుచీర కట్టుకొని హాల్లోకి వచ్చింది. రావు కళ్ళు మిరిమిట్లుగొలిపేయి. ఎర్రగా ధగధగా మెరిసే పట్టుచీరలో కాత్యా ‘అప్సరస’లా వుంది

“అంతలా చూసెయ్యకండి – దిష్టి తగిలేను...” కాత్యా చెల్లెలు కొంటెగా అంది.

అసలే మోహమాటస్తుడయిన రావుకి సిగ్గేసింది. తన మైమరపుకి తనే నిందిఁచుకున్నాడు. అందరూ గొల్లుమని నవ్వేరు. ఆమె తల్లి ఆ పిల్లని మందలించింది ఏవిటా వేళాకోళాలు – అంటూ.

కాత్యా తన పెద్ద పెద్ద కళ్ళను వాల్చేసుకుని చేతులు కట్టుకుని తల వంచి నిలబడిపోయింది ఏం చేయాలో తోచక.

వాళ్ళిద్దరూ పెద్దలందరికీ నమస్కారాలు పెట్టేరు. ఆశీర్వాదాలందుకొన్నారు.

బావమరిది, రావుని విశాలమైన మేడమీది గదిలోకి తీసుకెళ్ళి,

''ఇదే మీ రాజ్యం...'' అని చిలిపిగా కన్నుగీటి వెళ్ళిపోయేడు —

పెద్ద పాతకాలం పందిరిమంచం — మెత్తటి పరుపుమీద తెల్లటి బెడ్‌స్ప్రెడ్ ... అగరొత్తులూ, స్వీట్స్, పళ్ళూ అట్టహాసంగా, సినిమాల్లోలానే వుంది అన్నం అనుకున్నాడు రావు — కాలక్షేపానికి ఏమైనా చదువుకుందామంటే చిన్న పేపర్ ముక్క కూడా లేదక్కడ.

మంచానికి చేరబడి, ఒళ్ళో దిండు పెట్టుకుని కళ్ళు మూసుకున్నాడు అలసటగా రావు — మూడ్రోజులైంది సరైన నిద్రపోయి మూడ్రోజులేమిటి ఈ పెళ్ళి నిశ్చయమైంది దగ్గర్నించీ నిద్రలేదు — చూడగానే మంచి పిల్ల అన్పించే అందమైన కాత్యాయినిని ఎప్పుడైతే చూసేడో అప్పట్నించే రావుకి నిద్రపట్టటం మానేసింది.

నిజంగా కాత్యా మెతకపిల్లే 'చిరునవ్వులు చిందించటం తప్ప మరేమీ తెలియని ముగ్ధ ఈమె' అన్పించేలా వుంటుంది కాలేజ్‌లో ఇంటర్ చదివినా ఈ కాలం పిల్లల్లా గడుసుదనం మచ్చుకైనా కనుపించదు.

లేకపోతే ఏవిటి ?

జరిగిన పెళ్లి తంతులో పిచ్చిపిల్ల ఓడిపోతూనేవుంది

తలంబ్రాలు పోసేప్పుడు చివరివరకూ బుల్లి బుల్లి దోసిళ్లతో పోస్తూంటే, రావు ఫ్రెండ్స్ గొడవ పళ్లెం ఎత్తి పోసెయ్యరా అని ... రావు తనదీ, ఆమెదీ కూడా పళ్లేలు ఎత్తి ఆమె నెత్తిన కుమ్మరించేడు ! ఆలుచిప్పల్లాంటి ఆ కళ్లనెత్తి అలా తన వైపు చూడబోయి అతని చూపుల్లో ఆమె చూపులు చిక్కుకుంటాయని కాబోలు గబుక్కున వాల్చేసుకుంది !

ఆమె స్నేహితురాళ్ళు, ''మొద్దూ ... ఛీ ... సిగ్గులేదుటే అలా పోస్తుంటే చూస్తూ వూరుకుంటావా ?'' అని చిలిపిగా మందలిస్తున్నా ముగ్ధమనోహరమైన చిరునవ్వుతో అలాగే కూర్చుండిపోయింది

ఆ తరువాతమాత్రం ?

ఇరుకుమూతి బిందెలో ఉంగరం, మెట్టె వడేసి బ్రాహ్మడు ఇద్దర్ని చేతులూ అందులో వుంచి ఎవరు ఉంగరం తీస్తే వారు గెలిచినట్లే అన్నపుడు, చెయ్యి అందులో పెట్టడానికి మహా సిగ్గుపడిపోయింది. రావు వైపు ఇబ్బందిగా చూసింది. అతను ఫర్వాలేదన్నట్లు చూసి తన చెయ్యి పెట్టేక రెండు క్షణాలాగి కాత్యా తన చెయ్యి పెట్టింది.

అప్పుడు తానేం చేసేడు ?

ఉంగరంకోసం వెతక్కుండా తెల్లని ఆ బుల్లి చేతిని పట్టుకున్నాడు ... పాపం ఎంత సిగ్గుపడి పోయిందో — ఆమె ఫ్రెండ్స్

''తియ్యవే ఉంగరం'' అని కాకిగోల

ఆమె వెతకటం మొదలెట్టింది రావు చేతికి మెట్టె వచ్చింది. అది తీసి ఆమె చేతిలో బలవంతాన పెట్టి ఆమె చేతిని గిల్లి ఉంగరం లాక్కున్నాడు. అందమైన చిరునవ్వుని పెదవుల వరకే బిగించి చూసిన ఆ చూపు రావు వెయ్యి జన్మలకైనా మరచిపోగలడా ?

పాపం రావు కోసం మూడుసార్లూ ఓడిపోయింది !

అప్పగింతలయి విడిదింట్లోకి కాత్యాతో సహా అందరూ వెళ్లి కూచున్నారు.

తీరిగ్గా వున్న అమ్మలక్కలు ''ఏదమ్మాయ్, నువ్వు బాగా సంగీతం నేర్చుకున్నావుటకదూ ! ఓ పాట పాడు...'' అన్నారు.

పాపం, కొత్తకదా, భయపడిపోయింది

రావు వైపు రక్షించమన్నట్లు చూసింది దీనంగా.

''ప్లీజ్, నాకు జలుబుచేసి గొంతు మూసుకు పోయింది ఆ సంగతి వాళ్లతో చెప్పండి'' అంది రహస్యంగా.

''తనకి పాపం జలుబు చేసిందట తర్వాత పాడుతుందిలే'' ఇంకా వాక్యం పూర్తైనా కాకముందే చెల్లాయి —

''అమ్మో ! వదిన ఎంత గడుసుదిరా అన్నయ్యా, ఇంకా పెళ్ళయి రెండుగంటలన్నా కాలేదు ఎలా వెనకేసు కొస్తున్నావురా .''

కాత్యాని గడుసు అంటే రావు భరించలేక పోయేడు పట్టుదల పెరిగింది.

''కాత్యా ! ఎలాగోలా పాడెయ్ !''

''ఎలాగండీ ''

''ఇలా మాట్లాడుకొంటే అంతా ఎగతాళి చేస్తారు — పాడు.''

కొద్దిగా ఆజ్ఞాపించినట్లే అన్నాడు రావు

పాపం వెంటనే పాడేసిందో కృతి !

రావుకి సంగీతం తెలీదు. అయినా మైమరచి పోయేడు ఎంత మధురమైన గొంతుక కాత్యాది... ఎన్ని జన్మల పుణ్యమో తనది ... ఇంత మంచి భార్య దొరకటం !

* * *

కాలి అందెల రవళులు ... మృదువుగా పడే అడుగుల సవ్వడి తలెత్తి చూసేడు రావు .. దేవతలా నుంచుంది కాత్యా ... గుమ్మం పట్టుకుని ... 'ఎంత ముద్దొస్తోందో' అనుకున్నాడు రావు.

మెల్లగా లేచి ఆమె వైపుకి నడిచేడు.

''ఎన్ని యుగాలనించీ తపస్సు చేస్తున్నానో తెలుసా ?''

చిరునవ్వు .. అదే ... ఆ చిరునవ్వే తన ప్రాణాలు తీసేది.

''ఎంత ముద్దొస్తున్నావో !''

గబుక్కున అరచేతుల్లో మొహం దాచుకుంది.

ఎంత పొడుగాటి వేళ్ళు ... పొడుగ్గా పెంచిన గోళ్లకి వున్న గోరింటాకు తళుక్కుమంది.

రావు హృదయంలో కోటి మందారాలు పూసినయ్.

''ఏయ్ ఏమిటా సిగ్గు ? ఇక్కడెవరు న్నారని ?''

''........''

''మాట్లాడవా ! సిగ్గెందుకు బుజ్జీ ?''

''మీరున్నారనీ...''

నవ్వొచ్చింది రావుకి ! పెద్దగా నవ్వేసేడు.

ఆమె భుజాల చుట్టూ చేతులువేసి ''అలా కూచుందామా ?'' అంటూ మంచంవేపు నడిపించుకెళ్లాడు.

కూచున్నాక ఆమె తల్లో సంపెంగలూ, విరజాజుల వాసన గాఢంగా పీల్చి, ''అబ్బ, ఎంత హాయిగా వుంది'' అన్నాడు తన మొహాన్ని ఆమె భుజంమీద ఆన్చి తన్మయత్వంగా —

ఇబ్బందిగా కదిలింది కాత్యా —

అదేం గమనించే స్థితిలో లేడు రావు.

''అన్నట్లు, ఓ పాట పాడవా ?'' అన్నాడు ఆమె మొహంలో మొహం పెట్టి.

మొహం చిట్లించి గబుక్కున అటు తిప్పేసుకుందామె —

''ఛ ఛ, ఆ సిగ్గేమిటి నీకు ఖర్మ ? నేనిటు మాట్లాడుతుంటే అటు చూస్తావు...'' అని బలవంతంగా తనవైపు తిప్పుకున్నాడు

కంపరాన్ని బలవంతాన అణుచుకుంటూ అతనివైపు తిరిగింది కాత్యా.

''ఎంతసేపూ నే వాగటమేనా ? నువ్వు మాట్లాడు కాత్యా'' అన్నాడు గుసగుసగా.

అతని ఊపిరి వెచ్చగా తగుల్తోంది.

''ఏం మాట్లాడనూ...'' అతి ప్రయత్నం మీద అంది. ఎంత దాచుకుందామన్నా విసుగు ఆమె మొహంలో కన్పిస్తోంది.

''నీ కళ్ళు ... బ్యూటిఫుల్...'' అంటూ మీదకి వంగబోయేడు — చటుక్కున మొహం తిప్పుకుంది

''ప్లీజ్ ! ఒక్కసారి ... కాత్యా ప్లీజ్ !'' ఆమె గడ్డం పట్టుకుని తనవేపు తిప్పుకున్నాడు... అతను ఏమాత్రం పరికించినా ఆమె మొహంలో నిరసన కనిపెట్టగలిగివుండేవాడు —

ఆపుకోలేని ఆవేశంతో ఆమెని హృదయానికి హత్తుకున్నాడు ... చేతుల్ని నెట్టేస్తున్నా పట్టించుకోలేదతను.

ఆమె మొహంమీదకు మొహం వంచి పెదవుల మీద గాఢంగా ముద్దు పెట్టుకోబోయేడు.

అతన్ని ఒక్కతోపుతోసి దూరంగా నిలుచుంది.

తెల్లబోయేడు రావు. అప్పటిగ్గానీ ఆమె కళ్ళల్లో నిరసనని పసిగట్టలేకపోయేడు.

ఆమె దగ్గరకు వెళ్ళి,

''ఏమిటిది కాత్యా ? ఏమైంది ?'' అన్నాడు ఆమె కళ్ళల్లోకి చూడ్డానికి ప్రయత్నిస్తూ.

తల దించుకొంది.

ఆమెని అలా చూస్తూ నిగ్రహంతో వుండలేకపోయేడు రావు. ఏమీ ఆలోచించకుండా ఆమెని దగ్గరకు తీసుకోబోయేడు.

ఊపిరి బిగపట్టుకున్నట్టు ఒక సెకండు మాత్రమే కౌగిలిలో వుండి తన చుట్టూ వున్న అతని చేతుల్ని విడిపించుకుంది.

''ఎందుకిలా బిహేవ్ చేస్తున్నావ్ ? నేనంటే ఇష్టంలేదా ?'' ఈ ప్రశ్న అడగటానికి అతను చాలా ఫీలయ్యేడు. ఆమెకి తనంటే ఇష్టంలేదు

అని అనుకోటానికే అతనికి భయంవేసింది. టిగులనిపించింది .

అన్నిటికన్నా ఆమె మౌనం అతన్ని మరీ కృంగదీసింది

"నీ మనసులో వున్నదేదో ఫ్రాంక్‌గా చెప్పెయ్ కాత్యా ... నేనేమీ అనుకోను..."

చురుగ్గా కళ్ళెత్తి అతని వైపు చూసింది

"ఎందుకా మౌనం ? నువ్వెవర్నైనా ప్రేమించావా ?" కృంగిపోతూన్న నవనాడుల్నీ కూడగట్టుకుంటూ అతి దీనంగా అడిగేడు రావు. ఎంచేతో అతనికి ఆమె మీద కోపం రావటంలేదు. తన దురదృష్టం మీద తనకే విసుగూ, అసహ్యం పుడుతున్నాయ్.

"చెప్పు కాత్యాయనీ ? నీ కిష్టంలేని పెళ్లి చేసేరా మీవాళ్ళు ?"

".. ... ..."

"చెప్పు ప్లీజ్ ! నన్నింకా బాధపెట్టకు!"

ఆమె భుజాలు పట్టుకుని వూపుతూ అడిగేడు పట్టరాని ఆవేశంగా రావు.

"నేను... నేను మిమ్మల్నేం చేసేను ?" మెల్లగా అంది

"లేకపోతే ఏవిటి ? నన్నెందుకు దగ్గరకు రానివ్వవు ? నీ మనసులో ఎవరైనా వుంటే చెప్పు కాత్యా... నేనేమనుకోను !"

"ఇదేమన్నా సినిమా అనుకున్నారా ?"

## రహస్యం

"అది నాకన్నా నీకే బాగా తెలియాలి..." మెల్లగా ఆమెని ఒదిలేస్తూ అన్నాడు.

ఆమె రిలీఫ్‌గా ఫీలయి గట్టిగా నిట్టూర్చడం గమనించిన అతని మనసు వెయ్యి ముక్కలైంది.

తనంటే ఆ అమ్మాయికి ఎందుకంత ఏవగింపు ? ఈ రకమైన తిరస్కారం జరిగిన పెళ్లితంతులో ఎక్కడా ప్రదర్శించలేదే ! ఏమో తనే గమనించి వుండడు !

కొంపదీసి ఆ అమ్మాయికి స్త్రీ సహజమైన కోరికలేమీ లేవా ?

అదేమీ అయివుండదు. ఎవడ్నో ప్రేమించి వుంటుంది. ఆ విషయం తలిదండ్రులతో చెప్పేందుకు భయపడి ఈ పెళ్లికి ఒప్పుకుని వుంటుంది.

తను అదృష్టవంతుణ్నని పొంగిపోయేడు చదువు అయిపోగానే మంచి జాబ్ రావటం, అనుకోకుండా అందమైన కాత్యా తన భార్య అవటం నిజంగా ఏ జన్మలో చేసుకున్న అదృష్టమో అనుకున్నాడు కానీ... కానీ ఇలా జరిగిందేమిటి ?

కిటికీ దగ్గరకి నడిచి దూరంగా ఎటో చూస్తూ నించుండిపోయేడు.

వెనక్కి తిరిగి ఆ అమ్మాయిని చూడాలంటేనే అసహ్యమేస్తోంది.

## నీకోసం

జీవన గమనంపై ఆశలు
వలపుల కవితలు
చతుర రాగాలు
ప్రణయ స్వప్నాలు
మధుర భావాలు
హృదయ పంజరంలో
బందీలుగా చేశాను.
అధరంలో మధువులు
హృదయంలో వలపులు
పదిలంగా దాచి నీకై వేచాను.

— అరుణ

ఎంత మోసగత్తె ? అమాయకురాల్లా కన్పిస్తూ తన జీవితాన్ని నిలువునా దహించి వేసింది... ఈ మహాతల్లిపాలిట తానే పెద్ద విక్టిమ్ అవటం... భగవాన్ ఏం పాపం చేసాడు తాను ? ఆలోచిస్తూ ఎంతసేపు కూచున్నాడో అతనికే తెలీదు...

తను ఆ అమ్మాయి భర్త ... ఆ అమ్మాయికి ఇష్టమున్నా లేకపోయినా బలవంతంగా అనుభవించేందుకు తనకి హక్కు వుంది. చవట వెధవలా యిలా ఏడుస్తూ కూచోవలసిన ఖర్మ తనకేమీ లేదు ... ఛ ఎంత మీన్‌గా ఆలోచిస్తున్నాడు తాను...తన భార్యని తను చెరపట్టడమా ?! 'ఐ కాంట్ రేప్ మై వైఫ్...' బట్ ... ఈ విషయం ఇప్పుడే తేల్చుకోవాలి. ఆ అమ్మాయికి నిజంగా తనంటే ఇష్టంలేకపోతే...ఇష్టంలేకపోతే ఆ ప్రేమించినవాడెవడో వాడి దగ్గరకే పంపేస్తాడు తాను ... మనసులేని భార్య తన కొద్దు ... తనని తానుగా ప్రేమించే భార్యనే తాను కోరుకుంది !

తల తిప్పి చూసేడు. కాలి బొటనవ్రేలితో నేలను రాస్తూ అలాగే నించునివుంది కాత్యా...

"మహానటి !" అని పళ్ళు పటపట కొరుక్కున్నాడు.

అంతలోనే జాలి వేసిందామె మీద. ఛ ! చిన్నపిల్ల భయపడిందేమో ... ఆమె భయం పోగొట్టవలసిన బాధ్యత తన మీద వుంది...

"కాత్యా...ఇలారా..." నెమ్మదిగా అన్నాడు.

బిక్కు బిక్కుమంటూ చూసిందతనివైపు.

"నిన్నే ... ఏవిటా మొండితనం ? ఇలా రా..." కరుగ్గా ధ్వనించిందతని గొంతు ... అంత కఠినంగా పిలిచి వుండకూడదనుకున్నాడు మనసులో రావు...

మెల్లగా అడుగులేసుకుంటూ అతని దగ్గరకు నడిచి వచ్చింది కాత్యా ... తన కతి సమీపంలోకి వచ్చిన ఆమెనించి కొంచెం వెనక్కి జరిగేడు రావు.

దెబ్బతిన్నట్టు చూసిందతనివైపు.

అదేమీ పట్టించుకోలేదు రావు.

"చూడు కాత్యా! పెళ్ళి అంటే తమాషా కాదు. నీ దురదృష్టమో ... నా దౌర్భాగ్యమో మనిద్దరికీ పెళ్ళయింది ... (ఆ సమయంలో కాత్యా కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి). ఇప్పటికైనా మించిపోయిందేమీలేదు. నీ మనసులో ఎవరున్నారో చెప్పు. అతన్నీ, నిన్నూ భగవంతుడిసాక్షిగా ఒకటిచేస్తాను ... కానీ ... కానీ నువ్వు ఇంత పిరికిగా ప్రవర్తించి మనిద్దరి జీవితాలూ నాశనం చేసేకంటే ముందే ధైర్యంగా మీవాళ్ళతో నీ సంగతి చెప్పి వుండవలసింది... ఎవరతను ?" పళ్ళ బిగువున అన్నాడు తన ఫీలింగ్స్ ఏవీ బయట పడకుండా...

"నాకెవరూ లేరండీ!" ఆమె గొంతు వణికింది.

"అబద్ధాలు ఆడేవాళ్ళంటే నాకు చాలా అసహ్యం. ఎందుకా అబద్ధాలు ?"

"ఒట్టు! అలాంటిదేమీ లేదండీ!" అంది దీనంగా.

ఆశ్చర్యంగా చూసాడామెవైపు, "మరి ? నేనంటే ఇష్టంలేదా ? అదైనా ముందే చెప్పొచ్చుగా ?"

"మీరంటే నాకు చాలా ఇష్టం... ఇష్టపడే చేసుకున్నాని పెళ్ళి !"

"లాభంలేదు... నీతో నేను నిజం చెప్పించలేను" నిస్పృహతో అన్నాడు రావు. కొద్ది క్షణాలు మౌనం.

చివరికి ఆమె ఓ నిశ్చయానికి వచ్చినట్టు,

"ఏవండీ..." అందతనివైపు తిరిగి; ఏవిటన్నట్టు చూశాడు.

"ఎలా చెప్పాలో తెలీటంలేదు..." అంది బెరుగ్గా.

'నా ఖర్మ' అని మనసులో తిట్టుకున్నాడు—

"మరి మీరు ఏమీ అనుకోకూడదు..."

'ఏడిసినట్లేవుంది... ఏవీ చెప్పకుండా ఏమనుకోనిచావను ?' అనుకున్నాడు.

"మరి...మరి... నాకు... చిన్నుల్లిపాయంటే అసహ్యమండీ !"

ఆ సంగతి ఇప్పుడెందుకో ఎంత తన్నుకున్నా రావుకి అర్థంకాలేదు.

"మీకు ఇష్టం కదూ!" అందతనివైపు కొంచెం ధైర్యంగా చూస్తూ.

నిజంగా పోదిమనిషి అని మనసులోనే విసుక్కున్నాడు.

"అయితే నన్ను దగ్గరకి రానివ్వకపోవటానికీ దీనికి సంబంధం ఏవిటి ? నా జేబులో వెల్లుల్లిపాయలు లేవే..." అన్నాడు వెటకారంగా.

'కానీ... కానీ మీ నోట్లోంచి చిన్నుల్లిపాయ వాసన ఘాటుగా వస్తోందండీ" అమాయకంగా అంది కాత్యా !

మొదట తెల్లబోయిన రావుకి పొట్ట చెక్కలయ్యేలా నవ్వొచ్చింది...

అతనికి దూరంగా నిలబడలేని కాత్యా అతని గుండెల్లో తల దాచుకొంది. ★

పశ్చిమజర్మనీలో జరిగిన పరుగుపందెం పోటీలలో 22 సంవత్సరాల కార్ల్ ఫ్లెషన్ 10,000 మీటర్ల దూరాన్ని 27 నిముషాల 36.8 సెకండ్ల సరిక్రొత్త రికార్డును స్థాపించాడు. శ్రీ ఫ్లెషన్ యిటీవలే ఇంజనీరింగులో ప్రాథమిక పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. ఆగస్టులో యూరోపియన్ కప్ పోటీలలో పాల్గొనాలనుకుంటున్నాడు.





'మనిషి — మృగము'లో జగ్గయ్య, జమున, గిరిబాబు

## శ్రీరామబంటులో పెళ్ళికాని పిల్లలు

పున్నమ్మ (అనిత) చేతిలోని పాల గిన్నె పొరబాటున జారి కిందపడడంతో దుర్గమ్మ (కల్పనారాయ్) నెత్తీ నోరూ బాదుకుంది. "అయ్యో, అయ్యో! నీకేం పోయేకాలమొచ్చిందే! ఇట్టైదు పాలు భూమిపాలు చేశావు? అయినా, నువ్విదంతా ఏ యేట్లో పెడుతున్నావంట? దుర్గమ్మ నోరు చెడ్డదని ఊరంతా అనుకోడానికి కాకపోతే — మా నాన్న పోతూ పోతూ ఈ సవితి చెల్లెళ్ళని నా నెత్తినపెట్టి వెళ్ళాడా?"

ఇంతలో పక్కింటి పుల్లమ్మ వచ్చి, 'దుర్గమ్మా! ఈ పిల్లతో నువ్వెక్కడ వేగుతావుకాని, ఎవర్నో ఒకరి చూసి ముడి పెట్టేసేయ్!'' అంది.

## సినిమా

[ 24వ పేజీ తరువాయి ]

"వాళ్ళే సంబడం. ముప్ఫై యేళ్ళు పైబడ్డాయి. నేనే యింకా మొగుణ్ని వెతుక్కోలేదు. ఇంక దీని గురించి వీధులమ్మట పడాలి. ఏదో ఆ బాలరాజు సినిమాలోలాగా ఎవడ్నో ఒకడ్ని చూసి ప్రేమించుకుపోతే, నాకో రోజుకు కుంచెడు బియ్యం మిగులుతాయి. సరేలే ... ఏమే! ఇంకా దీపపుసెమ్మలా అలా నిలబడ్డావు? అదంతా శుభ్రంచేసి లోపల తగలడు," అంటూ పున్నమ్మకు పురమాయించి, దుర్గమ్మ వెళ్ళిపోయింది. ఇంతలో బాలరాజు (రాజ్‌బాబు) వచ్చి "అమ్మా!" అని పిలిచాడు. "ఆఁ పోవయ్యా! పొద్దున్నే 'అంబా' అట! వేళాపాళాలేదు. ఇప్పుడు ముష్టివెయ్యరు పో!" అంది పున్నమ్మ.

"అంబా — అనలేదమ్మా. అమ్మా అన్నా. ఏదో లుంగీ కట్టుకున్నవాడు దొంగోడని, చెంబు పట్టుకున్నవాడు ముష్టోడని — మీరనవసరంగా అపార్థం చేసుకుంటున్నారు ... దుర్గమ్మగారి ఇల్లు ఇదేనా?"

"ఓహో! మీరా! కొత్త కాతానా? మా అక్క చెప్పింది."

"నువ్వు పాత కాతానా?"

"కాదు; నా పేరు పున్నమ్మ."

"పున్నమ్మా! పొట్టేళ్ళని వాడ్లో కట్టేశావా.. లేదా?"

"ఆహా! లోపల గేదెతో మా అక్క వుంది."

"మీ అక్కనా! వాళ్ళిద్దరికీ పెద్ద తేడా ఏం లేదు. అలాగే వుండనియ్. మరి, నీ పేరు చెప్పావుకాని, నా పేరు అడగలేదేంటి? నే చెప్పనా? సిగ్గేస్తోంది ... బాలరాజు..." అని అతను చెప్పేసరికి బాలరాజు సినిమా గురించి ఇందాక తన అక్క చెప్పిన విషయం గుర్తుకొచ్చి, పున్నమ్మ ముఖం విప్పారింది. "ఆఁ ... బాలరాజా? రండి — రండి..." అని లోపలికి ఆహ్వానించింది. బాలరాజు ఎంతగానో మురిసిపోయాడు.

"దాంతో తప్పుల తమాషా ప్రారంభమౌతుంది," అన్నారు రవిచిత్ర ఫిలింస్ "శ్రీరామబంటు" వర్ణ చిత్రానికి దర్శకత్వం వహించిన ఐ. ఎన్. మూర్తి. విజయవంతమైన "లక్ష్మి" అనే తమిళ చిత్రం ఆధారంగా వై. వి. రావ్ నిర్మించిన ఈ చిత్రం విడుదలకు సిద్ధంగా వుంది. చిరంజీవి, గీత, హరిప్రసాద్, సత్యకళ, మోహన్‌బాబు, కె. కె. శర్మ, అల్లు జనార్దనరావు, కె. వి. చలం, రమణమూర్తి, పెమ్మసాని రామకృష్ణ, ముక్కామల, కాశీనాథ్ తాతా, వీరభద్రరావు, గెస్ట్ పాత్రలో ప్రభాకరరెడ్డి నటించారు. దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు అవతరించిన మారుతిలా ఒక కోతి నటన ఈ చిత్రంలో విశేషాకర్షణ. గొల్లపూడి రచయిత, సత్యం సంగీత దర్శకుడు, పి. విజయ్‌కుమార్ ఛాయాగ్రాహకుడు.

## త్రిశూల ఆర్ట్ పిక్చర్స్

చినిపల్లి గంగాధర్ (సింహపురి) స్థాపించిన కొత్త చిత్ర నిర్మాణ సంస్థ ఇది. కృష్ణంరాజు నాయకుడుగా వీరి తొలి చిత్రం షూటింగ్ సెప్టెంబర్ నుంచి నవంబర్ వరకు జరుగుతుంది. చక్రవర్తి సంగీత దర్శకుడు. టి. కె. పి. చౌదరి నిర్మించే ఈ చిత్రానికి కొమ్మినేని దర్శకుడు.

## త్రిమూర్తి ప్రొడక్షన్స్ 6వ చిత్రం

"కృష్ణ హీరోగా ఆగస్టు నుంచి కొత్త వర్ణ చిత్రాన్ని ప్రారంభిస్తున్నాం. ఇదొక సరికొత్త రకం సస్పెన్స్ సబ్జెక్టు. ఇతర నటవర్గం, సాంకేతిక వర్గంలో లోగడ మా యూనిట్‌లో పనిచేసినవారే ఉంటారు," అని తెలియజేశారు నిర్మాతలు బాబ్జీ, సాంబశివరావులు.

'శివమెత్తిన సత్యం'లో కృష్ణంరాజు, గీత, శారద



# సత్యం...మధురం...సుందరం
# ఫిలిప్స్ ఫిలెటా
# 3-బ్యాండ్లు

భలే అవకాశం! ఏది కావాలో ఎంచుకోండి.




- డేంపింగ్ డయోడ్–అవరోధాలు లేకుండా స్పష్టంగా విన్పించేందుకు
- స్టెబిలైజింగ్ డయోడ్–బ్యాటరీ శక్తి పన్నగిల్లినా చక్కగా విన్పించేందుకు
- అతి తేలికగా తిరిగే పాయింటర్, పెద్ద ట్యూనింగ్ నాబ్–సులభంగా ట్యూన్ చేసుకోవడం కోసం
- 1500 mW ధ్వని అవుట్‌పుట్



* చిల్లరగా అమ్మే గరిష్ట వెల, ఎక్సైజ్ డ్యూటీతో సహా.
రాష్ట్ర అమ్మకం పన్ను, ఇతర స్థానిక పన్నులు అదనం.

## ఫిలిప్స్

**అత్యుత్తమమైనదానినే మీరు పొందాలని మా కోరిక**

CASPR-599-203 TL

## "పిచ్చి" అమ్మకం!

మ్యాడ్ ("పిచ్చి) అనే మాసపత్రిక కాపీలు నెలకు 29 లక్షలు అమ్ముడుపోతాయట. ఈ పత్రిక మాసపత్రిక అయినా కూడా ఫిబ్రవరి, మే, ఆగస్టు, నవంబరు నెలలు వెలువడదట. ఆ నెలలో ఆ మేడ్ పత్రిక కోసం చదువరులు పిచ్చెక్కిపోతారట.

## పశ్చిమ బెంగాల్లో డిస్నీలాండ్!

అమెరికాలోని డిస్నీలాండ్ వంటిదానిని మన దేశంలో! బిర్లా కుటుంబం వారు నిర్మింపదలచారట. ఈ లాండ్‌కు పశ్చిమ బెంగాల్‌లో వెయ్యి ఎకరాల నేల కేటాయింపబడిందట. ప్రారంభదశలోని ఖర్చుకు గాను అయిదు వందల కోట్ల రూపాయలు కేటాయించారట. ఈ పనికి జపాను, అమెరికా, ఫ్రాన్సు, డచ్ మొదలైన దేశాలు చేయూతనిస్తాయట — చేయూతనగ!!

## ఇరాన్‌లో కన్యలకే విద్యార్హత!

వివాహమయిన అమ్మాయిలు చదువుకొరకు విద్యాశాలలకు పోరాదు అనే చట్టం ఇరాన్ రాజ్యాంగం కొత్తగా చేసిందట. ఏ తరగతిలో చదువుతున్నాసరే, పెళ్ళవగానే ఆ స్త్రీ చదువు మానివేసి తీరాలి. కావాలంటే ఇంటివద్ద చదువుకోవచ్చును. పెళ్ళయిన అమ్మాయిలను విద్యాశాలలకు రానిస్తే వారు తమ వైవాహిక జీవితాలను గురించి, విశేషాలను గురించీ పెళ్ళికాని అమ్మాయిలతో ముచ్చటించి, ఆకన్నెపిల్లల మనస్సు పాడుచేస్తారని ఆ ప్రభుత్వం అభిప్రాయపడ్డదట — వో అర్జునాయుద్ధం ఎందుకు చేయనంటున్నా వోయ్ అంటే, వో కృష్ణా నేను యుద్ధంలో యువకులైన వారినందరినీ చంపేస్తే ఆ హతులైన వారి భార్యలు యౌవ్వన వికారాన్ని పొంది పరుల పొందు కోర్తారు. తస్మాత్ జాయతె వర్ణ సంకరః కనుక యీ వర్ణ సంకరం రాకుండా వుండాలంటే — అన్నాడట — అట్లుండెనిది.



## ప్రాణం నిలుపుకోడానికి శవ భక్షణ!

కెనడాకు చెందిన ఇద్‌హో ప్రాంతంలోని మంచుకొండలలో మే 5వ తేదీన ఒక విమానం కూలిపోతే అందులోని ప్రయాణికులలో చావగా మిగిలినవారిలో ఒకామె తన ప్రాణాలు నిలుపుకోడానికి చనిపోయిన తన తండ్రి శవాన్ని తిన్నదట. అయిదు రోజులపాటు చేతికందిన దుంపలు వగైరా తిని, ఆనక ఇంక ఆకలి బాధకు తాళలేక, తినడానికి ఏమీ లేక, తన తండ్రి శవాన్ని ఆమె తిని తన ప్రాణాన్ని నిలుపుకున్నదట. జాన్సన్ చనిపోతూ తన కూతురు డొన్నాకు ఒక లోలు కోటు అందిచ్చి నీ ప్రాణాలు ఎలాగయినా కాపాడుకో తల్లీ అన్నాడట. ఆమె, ఆమె భర్త బ్రెస్ట్‌బైరా కలసి ఆహారం కోసం విఫల ప్రయత్నం చేసి, చివరికి సంప్రదించుకుని, జాన్సన్ శవాన్ని పీక్కు తిన్నారట. 1972లో కూడా ఇలాగే వో విమాన ప్రమాదంలో బతికి బయటపడ్డ 16 మంది ప్రయాణికులు 28 శవాలను తిని తమ ప్రాణాలను కాపాడుకున్నారట.

## పశ్చిమ యిరోపాలో భారత్ గొడుగులకు గిరాకీ!

వెస్ట్ యూరోపియన్ దేశాలలో మన హిందూ దేశపు గొడుగులకు మాంచి గిరాకీ వున్నదట. మన గొడుగులంటే ఆదేశాలు పడిచస్తున్నాయట గ్లామరులో. మన దేశంలో తయారయిన గొడుగు భాగాల కోసం ఆదేశాల్లోని కొన్ని కంపెనీలు గగ్గోలెత్తిపోతున్నాయట — నో జోక్!

## తలనాటో పొరపాటు!

అస్సాం రాష్ట్రానికి చెందిన వ్యవసాయ శాఖలో పని చేస్తున్న గణేష్ గివుండర్ అనే ఆయన పేర ప్రభుత్వ తత్ సంబంధ శాఖ నుంచి వో ఉత్తరం వచ్చిందట. ఆ ఉత్తరం కాపీ ఆ శాఖకు చెందిన అధికారికి ఉందట. ఆ ఉత్తరంలో అయ్యా మీ పేరు ప్రమోషను లిస్టులో ఉన్నది. బహుశా మీకైనంత త్వరలో తమకు ఉన్నత పదవి రావచ్చును ఆవటాని ఉన్నదట. ఇంతకూ తమాషా ఏమిటంటే ఆ గణేష్ గివుండరు 1967 లోనే రిటైరయ్యిపోయారట. అద్గదీ!

## తనయుని హత్య చేసిన తండ్రి!

విరుద్ధాచలానికి చెందిన కుమారమంగళం గ్రామంలో 49 ఏళ్ల దనుజవేలు తన కూతురు రాజ కుమారికి వో సంబంధం నిర్ణయిస్తే ఆయన భార్య రాజాత్తి మరో సంబంధం నిర్ణయించి, భర్తకు తెలియకుండా ముహూర్తం కూడా పెట్టించేసిందట. ఈ విషయం తెలిసిన దనుజవేలు పెళ్లాన్ని పిలిచి చెప్పుతో కొట్టి, జాగ్రత్త చంపేస్తాను అని హెచ్చరించాడట. ఇది చూసిన అతని కొడుకు 18 ఏళ్ల పరమశివం రయ్యిన తండ్రి చెయ్యి పట్టుకుని మా కళ్ల ఎదుట మా తల్లిని కొడుతున్నావు సిగ్గులేదా అని అరిచే సరికి దనుజవేలు ఆత్రంలో చేతి కందిన చిన్న కత్తితో ఎగిరి తన కొడుకును గుండెలో ఒకే ఒక్క పోటు పొడిచాడట. దాంతో ఆ పరమశివం విలవిలా తన్నుకుని పరమశివ సాన్నిధ్యం చేరుకున్నాడట.

## అచ్చు పొరపాటా!

భారతదేశపు పోస్టలు డిపార్టుమెంటు వారు అప్పుడప్పుడ్ లాండ్ కవర్లలో కొన్నిట మీద తరవాత పై స్టాంపు ప్రింటు చేసిలేదట. అసలా కవర్లమీద ఏ ప్రింటూ లేకుండా వున్నాయట. తరువాత అందులోపైసలు పెట్టి వట్టి కవర్లు కొనుక్కోవాలంటే తీరి కూర్చుని పోస్టాఫీసుకే వెళ్ళాలా!

## తప్పిపోయిన భర్త కోసం మరణ నిరాహారదీక్ష!

1978 డిసెంబరు 12వ తేదీన తప్పిపోయిన తన భర్తను వెదకి తేవడంలో మద్రాసు రాయపురానికి చెందిన కమలమ్మ అనే ఆవిడ పోలీసుల అసమర్థతను గర్హించి తాను ఆమరణ నిరాహారదీక్ష ప్రారంభించదలచినట్లు ప్రకటించి జూన్ ఎనిమిదో తేదీన అంత పనీ ఆరంభించిందట. 1978 డిసెంబరు 12వ తేదీన ఆమె భర్త సన్నారు అనే వూరువెళ్ళి వస్తానని వెళ్ళారనీ, తిరిగింతవరకూ రాలేదని, పోలీసు రిపోర్టిచ్చినా, వారికి ప్రార్థనలు చేసినా ప్రయోజనం కనబడలేదనీ ఆవిడన్నదట. ఆవిడకు అయిదుగురు పిల్లలట!





# పొరపాటు ఎక్కడుంది?

బెహారా
వెంకట సుబ్బారావు

మండు వేసవి. ఒళ్ళంతా ఒంటిగంట కావస్తోంది. మంచంమీద దొర్లుతున్నారు రామనాథంగారు. సీలింగ్‌ఫాన్ వైపు చూసి మరోసారి తిట్టుకొన్నారు విద్యుచ్ఛక్తివారిని. ఆయన అర్థాంగి పార్వతమ్మ వంటగదికి ఆనుకొనివున్న వరండాలో మంచం వాల్చుకొని మేనివాల్చారుగాలికోసం. పెద్దబ్బాయి కాలేజీకి పట్నం వెళ్ళాడు. నిశ్శబ్దంగావుంది మల్లూ. ఆపల్లె పట్నానికి ఆరుమైళ్ళ దూరంలో వుంది. ఆ గ్రామంలోని భూస్వామందులలో ఒకరు రామనాథంగారు.

"అమ్మా!" అన్న ఆర్తనాదం రామనాథంగారి చెవిలో పడింది. "ఆగొంతు తమ అమ్మాయి సుజాతదే? అయినా అమ్మాయి యిప్పుడింత ఎండలో ఎందుకొస్తుంది? ఎవరో అయివుంటారు!" అనుకొని ప్రక్కకు వత్తిగిల్లారు రామనాథంగారు.

వీధి తలుపులు తీసిన చప్పుడయింది.

"అమ్మా! ఆయన పోయారమ్మా!" బావురుమంది ఆమె ఆమె సుజాతే! సందేహం లేదు! దిగ్గున మంచం దిగారు రామనాథంగారు గదిలోంచి బయటకు నడిచారు.

వీధివరండాలో తల్లీకూతుళ్ళిద్దరూ కుప్పలా కూలిపోయారు. ఆడపిల్లను చంకలోంచి వదిలింది సుజాత. తాను తల్లి ఒడిలో వాలి భోరున ఏడుస్తోంది.

"ఏమయిందమ్మా?" కూతుర్ని కావలించుకొని అడిగింది పార్వతమ్మ. ఆమె కడుపు చెరువయిపోయింది.

"వారు పోయారమ్మా!" ఏడుస్తూనే అంది సుజాత. ఆ అమంగళపు మాటలు విన్న రామనాథంగారు చెవులు మూసుకున్నారు.

"పోవడమేమిటే? ఎక్కడికి వెళ్ళాడు?" కంగారుగా అడిగింది పార్వతమ్మ.

"మమ్మల్ని వదిలి ఎక్కడికో వెళ్ళిపోయారమ్మా!" అంటూ గ●లు బాదుకొంది సుజాత.

"సరీగా చెప్పమ్మా! ఏమయింది?" గద్గదస్వరంతో భయంగా అడిగారు రామనాథంగారు ఆయనకు కాళ్ళు వణకనారంభించాయ్.

"మీ అల్లుడు గారు మమ్మల్ని ఒదిలి ఎక్కడికో పారిపోయారమ్మా!"

ఆ మాట తప్పించి మరో మాట చెప్పకుండా ఏడుస్తున్న కూతుర్ని చూసి, అంతదుఃఖంలోనూ ఎకాను పన్నారు రా థంగారు. పెద్ద మనవడు దిగాలుగా తనవైపు చూస్తూంటే గుండె నీరయింది ఆయనకి.

"నాకు తెల్సమ్మా! ఎప్పుడో ఒకప్పుడు వాళ్ళు నీ కాపరంలో నిప్పు పోస్తారని! వాళ్ళు మనుషులు కారే తల్లీ! ఎంతవస్తే వచ్చిందే" రాగాలు ప్రారంభించింది పార్వతమ్మ.

"వారిక రారమ్మా! మమ్మల్ని వదిలి వెళ్ళిపోయారు! పిల్లల్నెలా పెంచుకుంటానమ్మా!" బావురుమంది సుజాత

"తెలిసుండే ఈ సమ్మంధం చేసి నీ గొంతు కోసావే తల్లీ! కాంతం పిన్ని అనాడే చెప్పింది! ఇంత రాక్షసుణ్ణి ...లేక పోయావే"

తల్లీ కూతుళ్ళ రాగాలు విన్న రామనాథంగారు సహనాన్ని కోల్పోయారు.

"అబ్బబ్బ! ఏమిటా ఏడుపులు." విసుక్కున్నారు.

"ఏడుపు కాకపోతే యింకేమిటండీ! పాతికేళ్ళు నిండలేదు నా పిల్లకి! ఇద్దరు పిల్లలు. ఎలా సాకుతుందో! నా బాధ మీకేం అర్థం అవుతుంది! ఈ సమ్మంధం వద్దండీ అంటే విన్నారు కాదు!"

పార్వతమ్మ రాగాలు వదల్లేదు.

ఎదురుగా కొంచెం దూరంలో వున్న కుర్చీలో కూలబడ్డారు రామనాథంగారు.

తల్లీ కూతుళ్ళిద్దరూ రాగాలు మానేశారు.

## పొరపాటు ఎక్కడుంది?

"సుజాత! ఇలా రా తల్లీ!" నెమ్మదిగా పిలిచారు.

అమ్మాయి దగ్గరగా వచ్చాక ఆమె మొహంలోకి చూసారు కళ్ళు వాచిపోయి ఎర్రగా వున్నాయ్ కన్నీరు ఏకధారగా ప్రవహిస్తోంది

"ఇలా దగ్గరగా రామ్మా!" అన్నారు

ఆమె యింకా దగ్గరగా వచ్చాక అడిగారు "చూడమ్మా! రఘు అంత పిరికివాడు కాదు. బాధ్యత తెలీనివాడు అంతకన్నా కాదు! అతనే తిరిగి వస్తాడు!" ఓదార్చబోయారు

"ఇక రారు నాన్నగారూ! మా యింటి ఆయన ఆఫీసుకెళ్ళి కనుక్కున్నారు! వాళ్ళకి తెలియదన్నారు! శలవు కూడా పెట్టలేదుట!"

"ఎప్పుడు వెళ్ళాడమ్మా?"

"ఈ వాళ్టికి నాలుగు రోజులైంది! రాజమండ్రి బావగారింటికీ అమలాపురం అక్కగారింటికీ కూడా వెళ లేదుట!"

ఎలా చెప్పి ఆమెను సముదాయించాలో అర్థం కాలేదాయనకు.

"ఏమైనా గొడవలు పడ్డారా తల్లీ?" అనునయంగా అడిగారు

భర్త ప్రశ్నకు చిరాల్ని లేచింది పార్వతమ్మ.

"వారింట్లో రోజూ గొడవలేనండి! అది ఎంత రంపపు కోత అనుభవిస్తోందో మీకేం తెలుసు? చెప్పబోతే చెప్పనిచ్చేవారా ఏమైనానా! అది అత్తగారింట్లో ఎలా ఉంటోందో ఎప్పుడైనా తెల్సుకొన్నారా? ఇలా జరుగుతుందని నాకెప్పుడో తెల్సు. వాళ్ళు మనుషులు కాదు రాక్షసులు! చూస్తూనే పిల్లని గోతులోకి తోసాం!"

పార్వతమ్మ మాటలు రామనాథంగారికి కోపాన్ని తెప్పించాయ్. కోప తాపాలకది సమయం గాదని తనను సంబాళించుకొన్నారు.

"ఏమ్మా? ఏమైనా గొడవలు పడ్డారా?" మరలా అడిగారు కూతుర్ని ఆమె చెప్పడం మొదలు పెట్టింది

* * *

ఆనాడు సుజాత భర్త పుట్టినరోజు. ఆ వుదయం తొమ్మిదిన్నరకి భర్తకి అత్తగారు భోజనం వడ్డిస్తూ వుంటే "మీ అబ్బాయి మధ్యాహ్నం హల్వా చేయమంటున్నారు!" అంది సుజాత భర్తకి నెయ్యి వడ్డిస్తూ

"వాడు నీకు యిప్పుడయితే మొగుడయ్యాడుగానీ, కొడుక్కి ఏమిటిష్టమో తల్లికి తెలియదంటే వెర్రిదానా? వాడికి తీపిపదార్థాలంటే యిష్టం! పుట్టిన రోజునాడు హల్వాగానీ, మైసూర్‌పాక్‌గానీ చేయించుకుంటాడు!" అంది తల్లి కొడుకుని ఆప్యాయంగా చూస్తూ.

"ఏమో! ఆయన నాతో అన్నారు. మీతో చెప్పి! మీ అబ్బాయికి ఏమిటిష్టమో మీకు తెలీదని కాదు! దీనికింత వ్యాఖ్యానం చేస్తారనుకోలేదు!"

చిరుకోపంచూపింది సుజాత

"అవ్వ! నేనేం వ్యాఖ్యానం చేసానే?" అచ్చెరువు పోయింది అత్తగారు

అంతటితో వారివాగ్వాటిని ఆపు జేయించాలనుకొన్నాడు రఘు. మాటలు మార్చాడు

"అమ్మా! జీడిపప్పు తెచ్చి అల్మైరాలో పెట్టు!" అన్నాడు.

"హల్వా చేయించమని నాతో ఎందుకు చెప్పాలండి? మీ అమ్మగారితో చెప్పలేక పోయారా?" విరుచుకు పడింది భర్త మీద సుజాత

"ఎవరితో చెబితేనేం? చేసేది అమ్మ! నీకేమైనా చేతనవును కనుకనా?" చిన్నగా విసుక్కున్నాడు రఘు. గబగబా భోజనం ముగించి, ఆఫీసుకు వెళ్ళాడు.

సాయంత్రం నాల్గు గంటలయింది భర్త రాకకై ఎదురుచూస్తూ వీధి గుమ్మంలో నిలబడింది సుజాత తన పుట్టిన రోజునగానీ, ఆయన పుట్టినరోజునగానీ పిల్లలతో సినిమాకు పోవడం అలవాటు...అయితే ఆరోజు చీకాకుగ వెళ్ళాడు ఆవిషయం ఎత్తలేదు అంతకుముందు రోజు రాత్రి ఫలానా సినిమాకి వెళ్ళాలని అనుకున్నారు. తప్పకుండా సినిమా టైముకి ఆఫీసు నుండి వస్తాడనే నమ్మకంతో అతని రాకకై ఎదురు చూడసాగింది. సాయంత్రం ఆరున్నరవరకూ చూసింది చీకాకు పడింది అత్తగారు వచ్చాక సినిమాలూ, షికార్లూ బాగా తగ్గిపోయాయ్. వెళ్ళవద్దని ఆమె అనడం తానెప్పుడూ వినలేదు "ఎందుకురా అనవసరంగా డబ్బు తగలేస్తారు!" అని కొడుకుతో ఒకటి రెండుసార్లు అనడం మాత్రం వింది. అంటే అర్థం సినిమాలు కూడవద్దనేగా!

కనుచీకటి పడుతూండగా అత్తగార్కి పిల్లల్కి భోజనం పెట్టింది. చీకటిపడితే అత్తగారు ఏ పనీ చేయలేరు. తడుముకొంటారు. రాత్రయితే ఆమె సహాయం ఏమీ వుండదు. మనవళ్ళతో భోజనం చేసి వాళ్ళని పక్కలో పడుకోబెట్టుకొని కథలూ, కబుర్లూ చెప్పుకొంటుంది ఆమె.

రాత్రి ఎనిమిది గంటలకి రఘు యిల్లు చేరాడు. 'భోజనం అయిందామ్మా?'



స్తూనే మామూలుగా తల్లిని పలకరించాడు.

తల్లి జవాబు చెప్పక పోవడంతో నిద్ర పట్టిందనుకొన్నాడు. పిల్లలు ఆమెను కావలించుకొని పడుకొన్నారు.

"అమ్మ అన్నం తిందా?" అడిగాడు అన్నం వడ్డిస్తూన్న భార్యని వంటింట్లో.

"అలా అడుగుతారేం? మీ అమ్మగారికి అన్నం పెట్టడం లేదేమోనన్న అనుమానమా? రోజా మీ తో తినమనండి!"

పెడర్థం తీసుకొని కస్సుమంది సుజాత.

భార్య జవాబుకి విస్తుపోయాడు రఘు

"మేం భోంచేసాముర బాబూ!" అంది తల్లి తడుముకొంటూ వంటగదిలో ప్రవేశిస్తూ.

రఘు మాట్లాడలేదు.

"పుట్టినరోజు కదా! స్వీట్ చేయమన్నావ్! ఇప్పుడు ఇంటికి రావడం?" ఆప్యాయంగా అడిగి కొడుక్కి దగ్గరగా కూర్చొందామె.

"ఆఫీసులో అనుకోని పని తగిలింది! ఆలస్యం అయిపోయిందమ్మా!" అంటూ ప్లేట్లో వున్న హల్వాని కొంత తీసి తల్లికి అందించాడు.

"నే తిన్నారా బాబూ!" అంది హల్వా ముద్దను కొడుకు కంచంలో తిరిగిపడేస్తూ.

"నే పెట్టలేదనేగా మీ అనుమానం?" గింయ్ మంది సుజాత.

కోపంగా భార్యవంక చూసాడు రఘు.

"నీవు పెట్టలేదనీ, ఆమె తినలేదనీ కాదు! నా పుట్టినరోజున అమ్మకి నాచేత్తో పెట్టాలని తెచ్చాను!" అన్నాడు.

"మీరు మాటలు సర్దుకోకండి! ఈ యింట్లో నే నొక్కర్తినే పరాయి దాన్ని! మీ అమ్మగారే అన్నారుగా. ఇప్పుడైతే మిమ్మల్ని కట్టుకొని మీ యింటికి వచ్చానని. మొదటి నుంచీ మీరంతా ఒక్కటే!"

మధ్యాహ్నం ఏదో జరిగివుంటుందని గ్రహించాడు అతను. ఆ గాలివాన విసురు యింకా తగ్గలేదని అనుకొన్నాడు.

"ఎందుకలా అనుకొంటావ్? ఇప్పుడేమయిందని?" అడిగింది అత్తగారు.

"ఏమయిందా? మధ్యాహ్నం అనవలసినవన్నీ అనేసి యిప్పుడు ఏమీ ఎరగనట్టడుగుతున్నారు! మీ తల్లీ కొడుకు లిద్దర్కి నే నుండడం యిష్టం లేదు!"

కోడలు మాటలకి విలవిల్లాడి పోయింది అత్తగారు.

"సుజాతా! ఏమిటా మాటలు? నేనేమన్నానని! హల్వా నీవు చేస్తే పదును పోతుంది! నే చేస్తా చూసి తెల్సుకో అన్నానురా బాబూ! అంతే! నామీద విరుచుకు పడింది. ఈ ఇంట్లో దాని పెత్తనం పోయినట్టూ, నా యిష్టం చెలామణి అవుతున్నట్టూ బాధ పడిపోతోంది. విన్నో మాటల అంది. సహించి వూరుకున్నా! అత్తగారి మీద కోడలు హాం ం చేసే రోజుల వచ్చాయిరా బాబూ!"

అత్తగారి మాటలకి మరింత కుపితురాలైంది సుజాత.

"కోడళ్ళని రాచిరంపాన పెట్టడమే మీకలవాటు. మీ సంగతి పెళ్ళికాకముందే తెల్సు! మీ అప్పచెల్లెళ్ళు ఎలాంటి వారో మావాళ్ళు నాకు చెప్పారు. మీ అక్కయ్య పెద్దకోడలు ఎలా చచ్చిపోయిందో కూడా .........."

"సుజా! ఏం మాట్లాడుతున్నావో తెల్సా?" హుర్చించాడు రఘు అయినా సుజాత లక్ష్య పెట్టలేదు.

"అవును! ఉన్నమాటే అంటున్నా! మీ ఒదినగారు యింతవరకూ కోటరికం పడి పడి ఆఖర్కి ఎదురు తిరిగింది అక్కడ మీ అమ్మగారి ఆటలు యిక సాగలేదు ఇక్కడికి వచ్చి పడ్డారు నా పీకలమీదికి అడ్డమైనవాళ్ళచేత మాటలు తింటూ చచ్చి పడేంతటి కర్మ నా కేంలేదు! ఇది నా యిల్లు! నా యిష్టం!"

అని కోడలు ఆగగనే అత్తగారు మొదలు పెట్టింది.

"నా యిల్లూ, నా సంసారం మీ మామగారు పోయిన మరుక్షణంలోనే పోయ్ కొడుకులూ కోడళ్ళూ పెట్టే చీవాట్లు తింటూ వారు పోసే గంజినీళ్ళు త్రాగి పడుండే రోజులు వచ్చాయ్!"

అత్తగారి మాటలకి మరింత రెచ్చిపోయింది సుజాత.

"చూసారా! ఆమెకు గంజినీళ్ళు పోస్తున్నాంట! తిని లేద లేటే దీర్ఘ సంకటం పడుతుంది!"

"సుజా!" కోపంతో చేయెత్తాడు రఘు భయపడి వెనక్కి జరిగింది సుజాత.

"ఆఖర్కి మీ అబ్బాయిచేత కొట్టించడానికి కూడా సిద పడ్డారన్న మాట! నేను చస్తే మీ అబ్బాయికి మరో పెళ్ళి చేయాలని చూస్తున్నారు! పదిహేను వేలు తగలేసి చేసారు సంబంధం"– ఏడుపు లంకించుకొంది సుజాత.

"అందరికన్నా పెద్దదాన్ని! చావు నాకే యిందు వస్తుందమ్మా! ఆయన మహారాజులా బతికి పోయారు! ఈ కొడుకులతోనూ కోడళ్ళతోనూ సుఖాలు అనుభవించమని నన్ను వదిలి వెళ్ళిపోయారు!".

అత్తా, కోడళ్ళ నోళ్ళను మూయించలేని నిస్సహాయ స్థితిలో పడ్డాడు రఘు.

"అబ్బబ్బ! ఆపండి! కొంపలో నేను చస్తే అందరికీ బుద్ధి వస్తుంది! ఇది యిల్లు కాదు! నరకం! ఈ యింట్లో వుండేకన్నా సన్యాసుల్లో కల్సి పతి వూరూ తిరిగి ముష్టెత్తుకుంటే హాయిగా వుంటుంది! ఈ కొంపలో వుంటే ఒట్టు!"

అంటూ విసావిసా లేచి పోయాడు. ఆరాతి నడివీధిలో మంచం వేసుకొని పడుకొన్నాడు. మర్నాడుదయం మామూలుగానే లేచాడు. ముభావంగా మసిలాడు. భార్య కాఫీ అందించ లేదు. కొడుకుద్వారా పంపింది.

పదిగంటలు తూడగా "ఆఫీసు కెళుతున్నానమ్మా!" అంటూ కేకేసాడు గదిలోంచి.

"భోజనం చేసి వెళ్ళరా బాబూ వంట పోయింది!" అన్న తల్లి మాటలను వినిపించుకోలేదు. గబగబా గుమ్మం దిగాడు.

వంట గదిలోంచి గబగబా పరుగు దీసి వీధిగుమ్మంలోకి వెళ్ళింది సుజాత, భర్తను పిలవడానికి. అప్పటికే వీధి మలుపు తిరిగి పోయాడు రఘు. నిట్టూర్పు విడిచింది సుజాత.

అలా వెళ్ళిన రఘు నాలుగోరోజున కూడా తిరిగి యిల్లు చేరలేదు.

* * *

"ఆయన యిక రారు నాన్నగారూ! మా మీది కోపంతో ఏ అఘాయిత్యం చేసుకొన్నారో! భయంగా వుంది!" అంది సుజాత ఏడుస్తూ.

"ఆఫీసులో అడిగారా?" ప్రశ్నించింది తల్లి.

"మా యింటాయన ఆఫీసుకు వెళ్ళి కనుక్కున్నారు. ఆఫీసుకు శలవు కూడా పెట్టలేదుట. అమలాపురంలో వున్న వాళ్ళ అక్కకీ, రాజమండ్రీలో వున్న బావగారికీ ఫోన్లు చేసారు, ఎక్కడకీ వెళ్ళలేదు!"

"రఘు ఆత్మహత్య చేసుకునేంతటి అవివేకి కాదమ్మా! నీవేమీ భయపడకు! కోపంలో ఎటో వెళ్ళి వుంటాడు! తప్పకుండా తిరిగి వస్తాడు!" ధైర్యం చెప్పజూసారు రామనాథంగారు.

"మీరు ఒకసారి వెళ్ళి అన్నీ కనుక్కోండి" భర్తను తొందర చేసింది పార్వతమ్మ.

ఆలోచనలో పడ్డారు రామనాథంగారు.

"కూతురి బతుకు యిలా కుక్కలు చింపిన విస్తరి అవుతుందని ఏన్నడూ వూహించలేను! బోలెడు కట్నం పోసి మంచి సంబంధం చేసారు పిల్ల సుఖపడుతుందని కొన్నారు. అంతవరకూ సుఖపడింది కూడా. భార్యాపిల్లలను అతను ఏనాడూ నిర్లక్ష్యం చేయలేదు. నగానట్రా చేయించాడు. మరి ఏమిటీ విపరీతం? ఇలా ఏందుకు జరిగింది? ఇందుకు ఎవరు బాధ్యులు? అసలు పొరపాటు ఎక్కడ వుంది?"

"ఏమిటండీ మీనమేషాలు లెక్క పెడుతున్నారు? తొందరగ తెములండి!" మరలా భర్తను తొందర చేసింది పార్వతమ్మ.

"అబ్బాయి వేణూ కాలేజి నుంచి రానీ! వచ్చే వేళయింది! ఇద్దరమూ వెళ్దాం! ముందు అమ్మాయికి అన్నం పెట్టు! ఎప్పుడు తిందో ఏమో! దాని సంగతి చూడు! నీ కంగారు చూసి అది మరీ బెంగపెట్టుకొంటుంది! అల్లుడికేమీ ఫరవాలేదు!" నెమ్మదిగా భార్యను మందలించారు రామనాథంగారు.

పార్వతమ్మ కూతుర్ని లేవదీసి వంటగదిలోకి తీసుకెళ్ళింది.

వెనుకటి సంగతులూ, పెళ్ళికి పూర్వం జరిగిన సంఘటనలూ జ్ఞప్తికి వచ్చాయ్ ఆయనకు.

* * *

అనాటికి సుజాత పెళ్ళికి మూడు రోజులే వ్యవధి వుంది. ఆ రోజే సుజాతను పెళ్ళికూతుర్ని చేసారు. దగ్గర బంధువులు అందరూ వచ్చారు. ఇంటినిండా చుట్టాలు. తాను పొలానికి వెళ్ళి తిరిగి వచ్చాడు మంచి ఎండలో. ఆడవాళ్ళంతా పెద్ద గదిలో కూర్చుని కబుర్లు చెప్పుకొంటున్నారు. పిల్లలు పందిరి క్రింద ఆడుకుంటున్నారు. పెరట్లోకి వెళ్ళి చూసాడు. పెళ్ళికోసం కట్టించిన వంటపాకలో వంట బ్రాహ్మడు మిఠాయి చేస్తున్నాడు. అతనికి సహాయంగా వేణూ వున్నాడు. తిరిగి హాల్లోకి వచ్చాడు. ఆడవాళ్ళంతా హుషారుగా కబుర్లు చెప్పుకొంటున్నార. తాను వచ్చినట్లు ఎవరూ గమనించలేదు. గదికి ఆనుకొని వున్న వరండాలో వాలుకుర్చీ వేసుకొని నేను వాల్నాడు తాను.

గదిలోంచి కాంతమ్మగారి మాటలు పెద్దవిగా వినిపిస్తున్నాయ్. అంతా శ్రద్ధగానూ ఆశక్తిగానూ వింటున్నార, కథ వింటున్నట్లుగా. ఈ కాంతమ్మ తన భార్య పినతల్లికి తోటికోడలుకి అప్ప అవుతుంది.

"ఈ విషయం నీతో చెప్పాలా మానాలా అని వచ్చిన దగ్గర నుంచీ ఆలోచిస్తున్నానమ్మా!" అంది కాంతమ్మ పార్వతమ్మతో.

"ఏమిటో చెప్పండి పిన్నిగారూ!" కుతూహలంగా అడిగింది పార్వతమ్మ.

"ఈ గౌరమ్మ వుంది చూసావూ..." అని ఆగింది కాంతమ్మ.

"గౌరమ్మా? ఎవరండి?" ప్రశ్నించింది పార్వతమ్మ.

"అదేనమ్మా! మీ వియ్యపురాలు! నేనంతా ఒక వూరివాళ్ళమేగ. వాళ్ళింట్లో ఆమెను గౌరమ్మ అనే పిలుస్తారు!"

"ఆఁ అలాగ చెప్పండి!"

వాళ్ళ అత్త మామలు అంటే మా కేశ్వరమ్మ పరమ గయ్యాళి అనుకో. ఈ గౌరమ్మ కూడా అలాంటిదే!

"మీకెలా తెల్సు పిన్నిగారూ!" అమాయకంగా అడిగింది పార్వతమ్మ.

"అయ్యో పిచ్చితల్లి! మేమంతా ఒక వూరువాళ్ళమే కదూ! ఇప్పుడంటే పిల్లలకి వుద్యోగాలయి యిలా వూళ్ళమ్మట తిరుగుతున్నాంగానీ. వాళ్ళ సంగతులు మా వూరు వెళ్ళినప్పుడలా తెలుస్తూనే వుంటాయ్!"

"ఏమో నండి! వారి సంగతులు తెలీవ్! ఎవరూ చెప్పనూ లేదు కూడా!" ఆశ్చర్యపడింది పార్వతమ్మ.

"ఎవరు చెబుతారమ్మా? వాళ్ళంటే దగ్గర వాళ్ళు తప్ప? ఈ విషయం నాకు ముందు తెల్సింటే ఈ సమ్మందం పడనిచ్చేదాన్ని కాదు! అంతా అయిపోయాక తెల్సింది!"

నొచ్చుకొందామె.

ఒక్కక్షణం నిశ్శబ్దం.

"అవన్నీ యిప్పుడెందుకండీ? సంబంధం చేసుకోదల్చినప్పుడు వారితో సర్దుకొని పోవాలి! ఇలాంటి విషయాలు అందరికుండా యిప్పుడు అనుకోవడం మంచిది కాదు! పెద వారు! మీకు చెప్పాల్సిందని కాదు!"

నగచివాత పెట్టినట్లు చెప్పింది జయమ్మ. జయమ్మ రామనాథంగారి చెల్లెలు కూతురు.

"కావల్సిన దాని, కాబట్టి చెప్పాను. లేకపోతే నలుగురిలా నేనూ వూరుకొందును! నాకెందుకని! పొరపాటయింది తల్లీ!" కినుక వహించింది కాంతమ్మ.

"జయమ్మ మాటలు పట్టించుకోకండి పిన్నిగారూ! అదిచిన్నపిల!" ప్రసన్నరాలిగా మార్చుకొందుకు ప్రయత్నం చేస్తోంది పార్వతమ్మ



## పొరపాటు ఎక్కడుంది?

కాంతమ్మ మాట్లాడలేదు.

"అయినా పిన్నిగారూ! వీరు ఎప్పటి కబుర్లో చెబుతున్నారు! చిన్నప్పుడు మా సుజాత ఎంత పెంకితనం చేసేదని! ఇప్పుడు దీనంత అమాయకురాలెక్కడా వుండదు!"

నిర్లక్ష్యంగా కొట్టిపారేసింది పార్వతమ్మ.

కాంతమ్మ మరలా చెప్పడం మొదలు పెట్టింది.

"ఇప్పటికీ వాళ్ళంతేనమ్మా వెర్రిదానా! నాగేశ్వరమ్మ అచ్చం సినిమాలో సూర్యకాంతవే అనుకో! దాని పోరు పడలేకనే కదా దాని పెద్ద కోడలు నూతిలో పడి చచ్చింది. దాని కొడుక్కి మళ్ళీ పెళ్ళవడానికి పదేళ్ళు పట్టిందనుకో! ఎవరిస్తారు పిల్లని? ఇక నీ వియ్యపురాలు వట్టి ఓర్వలేని మనిషనుకో! కొడుకూ కోడలూ నవ్వుతూ మాట్లాడుకొంటే కంట్లో నిప్పులు పోసుకోబోతే ఒట్టు! పెడర్థాలు తీస్తుంది అన్నింటికీ! దాని పెద్ద కోడలు మా వూరి కరణంగారమ్మాయే కదూ! అది చెబుతూ వుంటుంది! నిలబడితే తప్పట కూర్చుంటే తప్పట!"

కాంతమ్మగారి మాటలు తాను వినలేక పోయాడు.

"పార్వతీ!" భార్యను పిల్చాడు కోపంగా.

"పిల్చారా నాన్నగారూ!" అంటూ వచ్చింది రెండో అమ్మాయి.

"నిన్ను కాదమ్మా అమ్మను పిలు!" విసుక్కున్నాడు.

"ఎందుకూ? ఏమిటో దాంతో చెప్పండి!" గదిలోంచే కేకవేసింది పార్వతమ్మ.

"ఓసారిలారా!" గట్టిగా పిల్చారు.

"అబ్బబ్బ! ఏమిటండీ అర్జంటు!" డిస్టర్బెన్సుకి చికాకు పడుతూ ఈవలకు వచ్చింది పార్వతమ్మ

"కబుర్లు చెప్పుకొంటున్నారు పనులేవీ లేవా?"

భార్యమీద విరుచుకు పడ్డాడు తాను.

"ఇప్పుడే భోజనాలయాయ్!" నెమ్మదిగా చెప్పింది

"పెరట్లో బ్రాహ్మడు విస్తాకు చేస్తున్నాడు. వాడి దగ్గర మీ కాంతం పిన్నిని కూర్చోమను! జాగ్రత్తగా వేస్తు లేకుండా చేస్తాడు!" ఆమెను అక్కడ

పంపించి వంపేయాలని అతని పథకం.

"ఆమెకు అసలే ఉబ్బసం! నూనె విసరు దగ్గర కూర్చుంటే ఇహ వడగక్కర్లేదు! డాక్టరు దగ్గరికి మీరే పరుగెత్తాలి! అయినా మన వేణా వున్నాడక్కడ."

తను మాట్లాడలేక పోయాడు. అయినా వూరుకోలేదు, "సుజాత అక్కడనే వుందా?"

"వుంది! ఫేను వుంది కదా అని అంతా అక్కడ కూర్చున్నాం! మేం ఖాళీగా కూర్చుంటే మీ కళ్ళు కుట్టుకుంటాయ్. మరో గంట పోతే ఎలాగూ వంట గదిలోకి రాక తప్పదు!" విసుక్కుందామె.

"అయితే సుజాతను యిలా పిలు!" అన్నాడు.

"అదెలా వస్తుందండీ! కాంతం పిన్ని గారి జడకి మల్లెలు కుడుతోంది!"

ఇక తనకు మనసులోని మాటను బయట పెట్టక తప్పలేదు.

"సుజాత దగ్గర దాని అత్తవారి గురించి అలా చెడ్డగా మాట్లాడ్డం మంచిది కాదు అత్తవారిమీద దానికి చెడు అభిప్రాయం ఏర్పడుతుంది. అది చాలా ప్రమాదకరం! ఈ విషయం మీ కాంతం పిన్నికి తెలియక పోయినా నీకైనా తెలియాలి (బుద్ధి లేకపోయినా అని అనాలనుకొన్నాడు కానీ అనలేక పోయాడు) ఆమె హరికథలా చెబుతూంటే మీరు ఆహా ఓహో అంటున్నారు. ఆ సంగతులు కట్టిపెట్టమని చెప్పు! లేదా ఆమెను ఏదో మిషమీద బయటకు పంపు! నీకు చేతగకపోతే నేవచ్చి చెబుతా!"

విస్పష్టంగా చెప్పాల్సింది చెప్పాడు తాను.

"బావుందండీ మీమాట! అత్తారింటో మనలాల్సింది అదేకదా! వాళ్ళెలాంటి వాళ్ళో తెల్సుకోకపోతే ఎలా?" భయపడుతూనే అంది పార్వతి.

భార్య అమాయకత్వానికీ జ్ఞానహీనతకు ఆశ్చర్యపోయాడు, ఆమెకు అర్థం అయేలా మరలా చెప్పాలనుకొన్నాడు

"సుజాత అత్తారు ఎలాంటి వాళ్ళో మనకు తెలీదు. వాళ్ళ గురించి ఈమె చెప్పింది ఎంత వరకూ నిజమో అసలే తెలీదు. ఇలాంటి విషయాలు సుజాత ముందు అనుకోవడం మంచిది కాదు. చాలా పొరపాటు గూడా. అత్తవారిమీద ఆమెకు చెడు అభిప్రాయం ఏర్పడుతుంది. ఒకసారి ఏర్పడ్డ అభిప్రాయాన్ని మార్చుకోవడం చాలా కష్టం! అది ఎన్నో అనర్థాలకి దారి తీస్తుంది. అందువల్ల నష్టపోయేది మనమే! మీ పిన్నిని బయటకు పంపలేకపోతే సుజాతనైనా బయటకు పంపు. ఆమె నా విషయాలు చెప్పడం ఆపుచేయమను!"

మారు మాటాడకుండా వెళ్ళింది పార్వతి సుజాతను బయటకు పంపేసింది.

ఆ సంఘటన తనకు యిప్పటికీ జ్ఞాపకం వుంది. దాని ప్రభావంవల్ల యింతటి విపరీత పరిణామం ఏర్పడుతుందని తాను నాడు వూహించుకోలేక పోయాడు. ఇప్పుడు ఏం చేయాలన్న ఆలోచనలో పడ్డాడు.

*   *   *

బాగా పొద్దుపోయింది ... బాగా సాయంత్రం అయింది పట్నం

...ంచి కాలేజీనుండి తిరిగి వస్తూన్న వేణూతో అల్లుడు కూడారావడం అందరికీ ఆశ్చర్యం వేసింది. ఆయిల్లు ఆనంద సాగరంలో మునిగిపోయింది.

"మీరిద్దర్రూ విలాకల్సారు?" ఆశ్చర్యపోతూ అడిగారు రామనాధంగారు.

"బావగారు బస్‌కోసం జంక్షన్‌లో వున్నారు. బస్‌రావడానికి చాలా టైముందని యిద్దరమూ సైకిల్ మీద వచ్చేసాం!" చెప్పాడు వేణు..

లోనికి వస్తూన్న అల్లుడికి ఎదురు వెళ్తూ అడిగింది పార్వతమ్మ.

"ఏమిటి బాబూ! ఇలా హడలి గొట్టేసావ్? ఎక్కడికి వెళ్ళావ్?"

జరిగిన విషయమంతా చెప్పాడు అల్లుడు.

"ఆరోజు వుదయం ఆఫీసుకు వెళ్తూంటే దారిలో మెసెంజరు ఎదురుపడి టెలిగ్రాం యిచ్చాడు. రాయ్‌పూర్‌లో రైల్వేలో మా స్నేహితుడు పనిచేస్తున్నాడు. వాడూ నేనూ కల్సి చదువుకొన్నాం. వాడి నాన్నగారు వాళ్ళబ్బాయితో బాటు నాకూ కాలేజీ చదువు చెప్పించారు. వాళ్ళబ్బాయి స్కూటర్ ఏక్సిడెంట్‌లో బాగా గాయపడ్డాడని టెలిగ్రాం యిచ్చారు. నాకేమీ తోచలేదు!"

"అయితేమాత్రం యింట్లో చెప్పకుండా వెళ్తావుటయ్యా? మేమెంతా కంగారు పడుతున్నాం!"

నిలదీసింది అత్తగారు.

"నేచెప్పేదివినండత్తగారూ! నాకేమీ తోచలేదు! స్వంత తమ్ముడికే ఏక్సిడెంటు అయినంత కంగారు పడ్డాను. వెంటనే ట్రైనువుంది. అక్కడే మాఆఫీసు గుమాస్తా రావ్ రావ్ కల్సాడు, రామారావు మావక్క వీధిలోనే వుంటున్నాడు. ఆఫీసుకి మూడు రోజులు శలవు కావాలని లెటరు రాసి అతనికిచ్చి, యిలా అర్జంటుగా రాయ్‌పూర్ వెళ్తున్నట్లు మా యింట్లో కూడా చెప్పమని చెప్పి. అయితే వాడొక మతిమరుపు మనిషి. వాడూ ఆరోజు నుంచీ నాలుగురోజులు శలవు పెట్టి బెజవాడ వెళ్ళాడు. నా విషయం మర్చి పోయాట్ట. నా లీవ్ లెటరు ఆఫీసుకు పంపనూలేదు, నా విషయం మా యింట్లో చెప్పనూలేదు. వాడూ ఈరోజే బెజవాడ నుంచి తిరిగి వచ్చాడు." "ఏరా యిలా చేసావ్?" అంటే

## పొరపాటు ఎక్కడుంది?

"వెరీ సారీ బ్రదర్! మర్చిపోయా!" అన్నాడు. జరిగిందంతా విని వాడూ చాలా విచారించాడు.

"అంతా అనుకోని విధంగా జరిగి అందర్నీ ఆందోళన పరిచింది! పాపం, మా అమ్మ మంచం దిగలేదు! మీ అమ్మాయి అంటే యిక్కడకు వచ్చేసింది. అదెక్కడకు పోగలదు? మూగ వేదన అనుభవించింది. నే వచ్చేసరికి మా అన్నయ్యా, అక్కాకూడా వచ్చి వున్నారు. నాకోసం నూతులూ, గోతులూ గాలించాలను కొంటున్నార్ట! పోలీసుకు రిపోర్టు చేయాలనుకొంటున్నాడు అన్నయ్య."

అంతా విని పకాల్న నవ్వాడు వేణు.

మందహాసం చేసారు రామనాధంగారు.

కళ్ళతో నవ్వింది సుజాత.



"బావుంది నాయనా! మేమంతా హడలి చచ్చాం!" నవ్వాపుకుంటూ అంది పార్వతమ్మ.

బావగారికి కుర్చీ వేసాడు వేణు.

కుర్చీలో కూర్చుని భార్య వైపు చూసాడు రఘు. చిరుకోపం అభినయించింది సుజాత.

"మావయ్యగారూ ఓ విషయం మీతో చెప్పాలని ఎన్నాళ్ళబట్టో అనుకొంటున్నా" అని ఆగాడు రఘు.

అంతా ఆతృతగా అతనివైపు చూసారు చెప్పమన్నట్లు. భర్త ఏమంటారో అని ఆసక్తిగా చూస్తోంది సుజాత.

"నే చెప్పేది మీకు అప్రియంగానే వుండొచ్చు! అయినా సందర్భం వచ్చింది కాబట్టి చెప్పక తప్పదు."

"చెప్పు బాబూ! పొరపాట్లు వుంటే ఎవరైనా సర్దుకోవాల్సిందే!"

"మీ అమ్మాయికి ఓర్పు తక్కువ! అనుమానం ఎక్కువ! దానికి తోడు అహంభావం కూడా వుంది!"

తనవైపు సుజాత కోపంగా చూసినా లక్ష్యపెట్టలేదు.

"ఈ విషయం ఇదివరకెన్నోసార్లు చెప్పాలనుకొన్నా! సందర్భం కుదిరింది కాదు!"

"అమ్మాయికి అనుభవం తక్కువ! పొరబాట్లు వుంటాయ్ బాబూ!" సర్దడానికి ప్రయత్నించింది పార్వతమ్మ.

"అసలు పొరపాటు మనదే!" స్వగతం పలుక్కున్నారు రామనాధంగారు. ఆ తర్వాత ఆప్యాయంగా అమ్మాయివైపు చూస్తూ అన్నారు.

"చూడమ్మా సుజాతా! నాపిల్ల బతుకు పాడైపోయిందని యింత వరకూ ఎంత నరకయాతన అనుభవించానో ఆ భగవంతునికే తెల్సు! తను పిల్లల జీవితాలు సుఖమయంగా వుండాలని ప్రతి తల్లిదండ్రులూ కోరుకొంటారు. వారు ఆనందమయ జీవితం అనుభవిస్తూంటే చూసి ఆనందించాలని అనుకొంటారు. తను జీవితం వారి చేతుల్లో కడతేరాలని భగవంతుని ప్రార్థిస్తూ వుంటారు! అది అత్యాశ కాజాలదమ్మా! అది సహజం! ప్రకృతి నైజం! సంసారమన్నాక ఎన్నో ఒడుదొడుకులు వస్తూ వుంటాయ్ శాంతము లేక సౌఖ్యము లేదు తల్లీ! నిర్మలమైన మనస్సుతో వున్నవారికి ఏ అపార్థాలూ తోచవ్! ఏ అపశ్రుతులూ వినిపించవ్! మనిషి యొక్క వ్యక్తిత్వం చేతల్లో కంటే మాటల్లోనే బయట పడుతుందమ్మా!"

సుజాత కళ్ళు అశ్రుపూరితాలయాయ్.

"సంసారాన్ని స్వర్గతుల్యంగా మలచు కోవడమైనా, నరకప్రాయంగామార్చుకోవడమైనా అంతా ఆడదాని చేతుల్లోనే వుందమ్మా!"

"నన్ను క్షమించండి నాన్నగారూ!" అంటూ తండ్రి పాదాంపై వాలింది సుజాత.

# సామెతల కథలు

## శ్రీకృష్ణ జన్మస్థానం

జైలు అన్న భావంలో వాడుతుంటాం. వ్యంగ్యాన్ని వ్యక్తపర్చటానికి జైలు అనకుండా ఈ సామెతను ఉపయోగిస్తుంటాం.

ద్రవిళుడు అను రాక్షసుడు, కంసుని తల్లిని కామించాడు. కాని ఆమె అతడి చేతికి చిక్కలేదు. తన కోర్కెను తీర్చుకోటానికి. ఆమె భర్త ఉగ్రసేనుని రూపంలో వెళ్ళి యామెతో రమించాడు. ఆమెకు తను వంచింపబడినట్లు అనుమానం వచ్చి అతణ్ణి నీవెవరివో చెప్పమని నిలదీసి అడిగింది. ద్రవిళునికి తన చిరకాలవాంఛ తీరింది. తృప్తితో తాను ద్రవిళుడననీ, చెప్పి, వ్యభిచారంవల్ల పిల్లలను కనటం ఏమంత తప్పు కాదనీ, అలా చాలా మంది చేసారనీ, యిలా పుట్టిన పిల్లలే చాలా బలవంతులుగా ఉంటారనీ, నీతులు చెప్పాడు.

ఆరోజుల్లో గర్భస్రావణావకాశాలు లేవుగా. నిజంతెల్సుకున్న ఆమె, అవమానంతో క్రుంగిపోతూ, కోపంతో, ద్రవిళుడవల్ల పుట్టే బిడ్డ కూడ రాక్షసుడవుతాడనీ, హరివంశంలో పుట్టినవాడి చేతుల్లో చస్తాడనీ,అన్నది. ఆమెమాటలు నిజమైనాయి. పుట్టిన బిడ్డ మగపిల్లవాడే. అతడే కంసుడు. తండ్రి రాక్షసలక్షణాలేయితడికీ వచ్చాయి. ఉగ్రసేనుని జైలులో పెట్టి రాజయ్యాడు.

కంసుని పినతండ్రి కూతురు దేవకి చెల్లెలి వివాహం వసుదేవునితో బ్రహ్మాండగా జరిపించాడు. సంతోషానందాలతో, స్వయంగా, చెల్లెల్నీ, బావమరిదినీ తనరథంలో, అత్తవారింటికి తీసుకెళ్ళుతున్న కంసుణ్ణి చూచి ఆకాశవాణి,"అలా విర్రవీగి పోకు... ఈ దంపతులకు పుట్టే ఎనిమిదవ బిడ్డ చేతుల్లో నీచావు తప్పదు." అని చెబుతుంది.

కంసుడు, ఆవంశ అంకురార్పణే లేకుండా చేసి, తన ప్రాణాన్ని కాపాడు కోవాలనుకున్నాడు. అందుకని దేవకినే చంపబోయాడు. వసుదేవుడు అడ్డుపడి, ఆడవాళ్ళను చంపగూడదు. వారికి పుట్టే బిడ్డలను చంపమనీ కంసుణ్ణి కోరాడు. కంసుడు దీనికి ఒప్పుకున్నాడు. దేవకినీ, వసుదేవుణ్ణీ కారాగారంలో పెట్టి వాళ్ళు పారిపోకుండా, పుట్టిన బిడ్డలుకూడా తనచేతినుండి జారిపోకుండా తగిన జాగ్రత్తలు తీసుకొన్నాడు.

ఇచ్చినమాట ప్రకారం, వసుదేవుడు జేష్ఠపుత్రుడు "గిరిమంతుని" కంసునకు అప్పచెప్పాడు. వసుదేవుడు అడిగినమాట తప్పలేదు కాబట్టి, కంసుడు అతణ్ణి వదిలెయ్యాలనుకున్నాడు. కాని నారదుడు, వసుదేవాదులు దేవతలనియూ, అతడు రాక్షసుడనియూ, విష్ణువు దేవకీ గర్భమున పుట్టి అతణ్ణి చంపుననియూ, కంసునకు చెప్పాడు. ఆమాటలు కంసుడు విన్నాడు దేవకీవసుదేవుల బిడ్డలను పుట్టిన వారిని పుట్టినట్లుగా పొట్టన పెట్టుకున్నాడు. ఆకారాగారంలోనే శ్రీకృష్ణుడు, ఎనిమిదవ బిడ్డగా జన్మించాడు.

లోకనాయకుడు తమకు కుమారుడుగ జన్మించాడని దేవకీవసుదేవులు సంతోషించారు వసుదేవుని బంధించిన సంకెళ్ళు వదులైనాయి కావలివారు నిద్రమత్తులో ఉండగా, వసుదేవుడా బిడ్డను తీసుకెళ్ళి, ద్వారకలో యశోద ప్రక్కనబెట్టి, యశోదకూ నందునకూ పుట్టిన ఆడబిడ్డను తెచ్చి దేవకి ప్రక్కన ఉంచాడు ఈ విషయం యశోదకు తెలియదు. శ్రీకృష్ణుని, ద్వారకకు వసుదేవుడు తీసుకెళ్ళుతుండగా, మధ్యనున్న యమునానది కూడా దోవ యిచ్చి, వసుదేవునికి సహాయపడింది.

దేవకి ప్రక్కనున్నఆడబిడ్డను చంపటానికి కంసుడు వచ్చాడు. ఆ బిడ్డను చంపితే, తనిసిరగడావుతుందనీ, తనకు ప్రాణభయం లేదనీ ఆశతో వచ్చాడు ఆ బిడ్డను పైకి ఎగరేసి, కత్తిని క్రింద పట్టుకున్నాడు. పైకి బిడ్డ పైనే మాయమైంది. ఆకాశవాణి, కంసుణ్ణి చంపేవాడు ద్వారకలో యశోదనందనుల వద్ద పెరుగుతున్నట్లు చెప్పింది.







ఆ తరువాత కృష్ణుణ్ణి చంపటానికి, ఎన్నో ప్రయత్నాలు చేసి, విఫలుడై, అతడే శ్రీకృష్ణునిచే చంపబడ్డాడు.

శ్రీకృష్ణుడు పుట్టింది జైల్లో. పెరిగింది ద్వారకలో. శ్రీకృష్ణుని పుట్టుకపై వచ్చిందే యీ సామెత. ఎవరికైనా, నీవు జైలుకువెళ్ళుతావురా, అని చెపటానికి బదులు అర్థోక్తిలో, ఆ తప్పు చేస్తే నీకు "శ్రీకృష్ణ" జన్మస్థానం (కృష్ణజన్మస్థానం)తప్పదురా, అని చెబుతుంటారు.

\- పద్మావతీ గంగాధర్.

వనితలకు మనవి

కొత్తరకం వంటలు

క్లుప్తంగా వ్రాసి పంపితే

త్వరగా పరిశీలించ వీలు —సం.



# హైదరాబాద్ నోట్‌బుక్

—తిరుమల రామచంద్ర

## కలచవీడు శ్రీనివాసాచార్యులు :

విప్లవకవి తల్లిజాడు, వైయాకరణశిరోమణి మిత్రుడు కలచవీడు శ్రీనివాసాచార్యులను ఇటీవల హైదరాబాద్‌లో ఒక సమావేశంలో కలుసుకొన్నప్పుడు అర్ధశతాబ్దినాటి సంఘటనలు విద్యుల్లతవలె మనోనభంలో మెరసి, అతని త్యాగశీలత, కార్యసాధన స్మృతికివచ్చి మేను గగుర్పొడిచింది. సహాయ నిరాకరణోద్యమం ముమ్మరంగా కొనసాగుతున్న సమయమది. విదేశ వస్తువులు, విదేశవిద్య ఒకటేమిటి విదేశ సంబంధం గల ప్రతిదానిని విసర్జింప వలెనని ఆబాలవృద్ధం ఆరాటపడుతున్న రోజులవి. ఆంగ్ల పాఠశాలలను బహిష్కరించడం, దేశసేవ పురస్కరించడం వీరకృత్యమైన కాలమది. ఆ కాలంలో హైస్కూలులో నాల్గవఫారం చదువుతున్న కలచవీడువారు చదువు వదలి, తిరుపతిలోని సంస్కృత కళాశాలలో విద్యార్థిగా చేరడంఅందరికీ విడ్డూరంగా ఉండేది. మూడవ ఫారం చదివిన వారు యంభంగా ప్రభుత్వోద్యోగాలలో దూరి, పెద్దాధికారి అయి ఉదార వేతనం పుచ్చుకోగల అవకాశం ఉన్నప్పుడు, వెర్రి వెంగళప్పలాగ సంస్కృత కళాశాలలో చేరి రామశబ్దం వల్లించడమేమిటి ? అవివేకం కాక మరేమిటి ? అనుకొనేవాళ్లం. అనర్గళంగా ఆయన ఆంగ్లంలో మాట్లాడుతుంటే విస్తుపోయి చూచేవాళ్లం. కాని కలచవీడువారు విదేశ విద్యవద్దని, భారతీయ సంస్కృతికి మూలకందమైన సంస్కృతోద్యమసంకల్పం తమకుతామై వరించి వచ్చారని మాకేమి తెలుసు ? తెలిసినా అర్థం చేసుకొనే అంతస్సేదీ ? కలచవీడు వారిది స్వాతంత్ర్య యోధులైన విద్వాంసుల కుటుంబం. జనకులు శ్రీ వేంకటాచార్యులుగారు సంస్కృతాంధ్రాంగ్లాలలో పండితులు. ప్రభుత్వోద్యోగులయినా, ప్రజాసేవను, భాషాసేవను ప్రధానంగా ఎంచినవారు. కనుకనే పెక్కు నాటకాలను రచించి ప్రదర్శింప చేశారు. తిరుప్పావైను, శ్రీ వ్రతరత్నమును, అని తెలుగుచేశారు. తల్లి శ్రీమతి సరసమ్మగారు శ్రీ వైష్ణవ సంప్రదాయం మూర్తీభవించిన మహిళామతల్లి. జ్యేష్ఠ భ్రాత శ్రీ వేంకట రమణాచార్యులు పట్టభద్రులై ఉన్నత ప్రభుత్వోద్యోగం వదలి దేశబంధుప్రెస్ అనే ముద్రణాలయం స్థాపించి, ఖద్దరు ఉద్యమం నడిపి, కారాగారక్లేశం పలుమారు అనుభవించి తల్లి గడ్డకు కీర్తి తెచ్చినవారు. మరి శ్రీనివాసాచార్యుల వారి అడుగుజాడలలో నడవడం సహజంకదా ! కలచవీడువారు తిరుపతి పాఠశాలకు పేరుతెచ్చినవిద్యార్థి. వ్యాకరణ శిరోమణి, విద్వాన్, బి. వొ. ఎల్. పట్టాలు పొందారు. పదేళ్లు పూర్తిగా అధ్యయనం చేసి, మహామహోపాధ్యాయ శ్రీముష్ణం సేతుమాధవాచార్యులు, మహామహోపాధ్యాయ పండపాటి దీక్షితర్ గార్ల అంతేవాసితతో భాష్యాంతం వ్యాకరణం అభ్యసించారు. స్నాతకులు కాగానే తమిళనాడులో తమిళాంధ్రాంగ్లసంస్కృతాలలో అష్టధర్మోపన్యాసాలుచేస్తూ సంచరించారు. 1936 నుండి 1971 వరకు ముప్పైయైదు సంవత్సరాలపాటు అనంతపురం మండలంలో సంస్కృతాంధ్రాధ్యాపకులుగా ఉన్నారు. అనేక సాహిత్య సాంస్కృతిక సమావేశాలలోఆంధ్ర, ఆంగ్ల, సంస్కృత భాషలలో గద్యపద్యోదధికి దీటురాగల ధాటిలో ప్రసంగించి సన్మానాలు పొందారు. రాయలసీమ సాహిత్య పరిషత్తు, రాయలసీమ నాటక పరిషత్తు మున్నగు సంస్థలకు వెన్నెముకగా మసలినారు. రామాయణ భారతాలను విశిష్టాద్వైతపరంగా ప్రవచించడంలో కలచవీడువారిదొక కమనీయపథం. అనంతపురం, ధర్మవరం రోటరీక్లబ్బు, లయన్స్ క్లబ్బు కలచవీడువారి సాహిత్య సంఘసేవను ప్రశంసించి ఘనంగా సత్కరించాయి. ప్రవచనం, ప్రసంగాలు ప్రధానమైనవారికి రచనావ్యాసంగం గౌణమని లోకంలో ప్రథ. కలచవీడువారు రచనా వ్యాసంగంలోను రాణికెక్కినవారు. పరివర్తన [పద్య కావ్యం), ఆసియా జ్యోతి (వచనం), సీతా (పద్యకావ్యం) మేవక, మద్యనిషేధం అనే నాటకాలు, చక్రతీర్థ కోదండరామస్వామి సుప్రభాతం, లక్ష్మీ సుప్రభాతం వంటి సంస్కృత రచనలు చాల ఉన్నవి. విరహి మేఘ సందేశానికి సీసపద్యాలలో అనువాదం. కలచవీడు వారి గొప్ప రచన సమగ్ర కాళిదాసం. ఇది కాళిదాసుని గ్రంథాలకు సరళాంధ్రానువాదం. కొంత ముద్రితం, కొంత అముద్రితం. దీని ముద్రణకు పూనుకొని, జ్ఞానలాభం పొందడం ఆంధ్రావళి విధి. ప్రస్తుతం కలచవీడు వారు సంస్కృతాంధ్ర పఠనోత్సుకులకు ఉత్సాహం కల్పిస్తూ, యథాశక్తి అనంతపురంలో సేవ చేస్తున్నారు. కలచవీడు వారి సతీమణి సౌభాగ్యవతి శేషమ్మ శ్రీ కృష్ణరాయలు ఆముక్తమాల్యదలో విష్ణుచిత్తుని అతిథి సత్కారాన్ని వర్ణించిన 'అనిష్టాన్నిధి గేహసీమ నడురేయాలించినన్ .... కృపయా భోక్తవ్యమన్ మాటలన్' తలపిస్తూ సారస్వత సేవకు చేదోడువాదోడుగా వుంటున్న విదుషి. కలచవీడు వారికి నలుగురు పుత్రులు, ముగ్గురు పుత్రికలు. అందరూ విద్యాగరిష్ఠులే. కలచవీడు వారు మొన్నటి మార్చి 30వ తేదీకి 68 సంవత్సరాలు పూర్తిచేసినా, ఇంకా ఒకతరం పాటయినా సాహిత్యసేవకు శారీరక, మానసికారోగ్యంతోఉన్నారు. వారి సేవాశక్తులను ఆంధ్రావళి వినియోగించుకోవాలి.

ఒక్క సంగతి మరిచాను. కలచవీడు వేంకటరమణాచార్యులు — స్వాతంత్ర్యయోధులే కాక, రాయప్రోలు వారి పద్ధతిలో కృష్ణవేణి, చారుమతి, పశ్చిమాంధ్ర ప్రబోధము — అనే ఖండ కావ్యాలు రచించిన భావ కవి తల్లిజాలు కూడ.

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.




## ఈ రోజుల్లో తలనొప్పి అంటే మాటలా!

## సాలోఫేన్‌ను వాడండి. అమోఘంగా నొప్పులను నివారించే విశిష్టమైన మాత్ర వెల అతి చౌక

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్—అయినప్పటికీ వెల మాత్రము 7 పైసలే ఒక మాత్ర. సాలోఫేన్ అతిశీఘ్రంగా, తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి, ఫ్లూ జ్వరాలకు కండలనొప్పులకు ఉపశమనం కల్గిస్తుంది.

సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు—వీళ్లతరబడి ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్ లిమిటెడ్ వారి తయారీ-

అమృతాంజన్ లిమిటెడ్‌వారి నమ్మకమైన తయారీ

**సాలోఫేన్**